# రామతీర్థ

గ్రంథకర్త:
కవిరత్న,
వంగవోలు ఆదిశేషయ్య
సీనియర్ తెలుంగు పండితుంలు
బోర్డు హైస్కూలు, ఎద్దనపూడి

పబ్లిషర్సు:
శ్రీరామా అండ్ కో
ఎడ్యుకేషనల్ పబ్లిషర్సు
చీరాల

 [1-0-0

# ప్రాంజలి

తలఁతున్ శారదపరాట్కుల
కలశార్ణవచంద్రు నిత్య కరుణాసాంద్రున్
లలితాంధ్ర సంస్కృతాంగ్లకు,
శలు సీతారామశర్మ సద్ధర్మగురున్.

స్వామి తల్లఁజుఁడు రామతీర్థుఁడు. మధురభావావేశపూర్ణ జీవిత మాతనిది. ఆజన్మాంత విద్యార్థియు, ఆదర్శ గృహస్థుఁడును, బోధకుఁడును, ప్రబోధకుఁడును నై, అనుష్ఠానవేదాంతియై దేశభక్తియుక్తుఁడై పరఁగిన యతనిచరిత్ర మెల్లరకుఁ బఠనీయము.

ఇట్టి మహనీయుని చరిత బాలురు తమ పాఠశాలయందుఁ జదివి తెలిసికొనిన వారిభావిజీవితము చక్కని పరివర్తనములతో లోక కళ్యాణము గలిగింపఁ గలదని భావించి చిరకాలము క్రిందటనే 'రామతీర్థస్వామి' యనుపేర నీచిన్ని పొత్తముఁను రచించి యుంటిని. కాని కారణాంతరములచే వెలికిఁ దేలేకపోయితిని.

నాకు గురుకల్పులును, ఆదిపూడి సోదరకవులలో నొకరు నగు శ్రీ అబ్బరాజు సూర్యనారాయణపంతులుగారి యామూలాగ్ర పరిశీలనలతో సిద్ధాని సంస్కరించి విద్యార్థిజనోపయుక్తంబిది యవశ్యము ప్రచురింపఁదగునని వారి వాక్యముల శిరసావహించి శ్రీవారి యాశీర్వచనబలముతోఁ బ్రకటనకుఁ గడంగితిని.

నేఁడు మాతృభాషకు దొరతనమువారు ప్రాధాన్యమిచ్చిన విషయ మందఱెఱింగినదే. భాషావేత్తలు, విమర్శకులు, పండితులు భాషారచనవిధానమునఁ బెక్కుపోకడలఁజిత్రించుచున్నారు. క్రొత్తఁదనముఁ జిలికించి పులకించు రచనలు వెలువడుభావ

జీవముగలది. ఈ చిన్నగ్రంథము సరళమై ధారాశుద్ధిగల శైలిని బాలుర కలవఱచి వారి హృదయముల నాకర్షించుచు ప్రవర్తనములు సరిదిద్దఁగల ఘట్టములను గల్గియున్నది.

గద్య రచనయందు లేఖల కీయఁదగినస్థానము నేఁటి మన వారు కొంతవఱకు గుర్తించుచున్నారు. ఇందలి రామతీర్థుని యుత్తరములఁ దిలకించిన లేఖారచనమునందలి సొంపు విద్యార్థులు గ్రహింపఁగలరు. ఉత్తమ లేఖారచనాచమత్కృతి గణింపఁగలరు. రామతీర్థుని జీవితము ఆకళింపుసేసికొనినవారికి గురుభక్తి, క్రమశిక్షణ పట్టువడితీరును.

నాకుఁ జేదోడై యియ్యది వెలుఁగునొంద సాయపడిన మాబావ శ్రీ నాగండ్ల లక్ష్మీకాంతము, బి. ఏ. (డిప్యూటీ తహసీల్దారు, సోంపేట)గారికి నే నెంతయుఁ గృతజ్ఞుఁడను.

విద్యావ్యవసాయమున నాకపరిమితోత్సాహము గలిగించి వాదోడైన మా ప్రధానోపాధ్యాయులు శ్రీ నాసిక మల్లికార్జున రావు, బి. ఏ., బి. ఇడి., గారికి నా నమస్సహస్రము.

విద్యాధికారులును, విద్యార్థులును నా యీ చిఱుపొత్తము నుపవాచకముగ నాదరించి నాకుఁ జేయూఁత నొసఁగమనవి.

గ్రంథకర్త

# రామతీర్థస్వామి

## జననము

పంజాబు రాష్ట్రమున గుజరన్వాలా మండలమునఁ గల దొక గ్రామము. దాని నామము మురళీవాల. అందు గోస్వామి వంశమునకుఁ జెందిన యొక బ్రాహ్మణశాఖ కలదు. ఈ శాఖీయులు దైవభక్తి ప్రచారకులు.

గోస్వామి హీరానందుఁడు సజ్జనుఁడు; నిఱుపేద. తన కుటుంబపోషణమునకుఁ జాలని వచుంబడి యతనికిఁ గలదు. అది యైనను పెషావరు స్వాటులలో నతఁడు గావించు సంచారముల మూలముననే వచ్చును. అతఁ డద్వైతాప్తుల హైందవ కుటుంబముల కాచార్యుఁడు గావునఁ బలుమరు శిష్యులకడ కేగి యేవో పారమార్థిక ప్రబోధములఁ గావించును. లేదా రామాయణాది సద్గ్రంథపారాయణము గావించును. ఇది యానువంశికముగ వచ్చు వృత్తియేగాని యిందాతని ప్రత్యేకత యేమియుఁ గన్పట్టదు. ఇతనికి గురుదాసుఁడను పుత్త్రుఁడు గలఁడు. గురుదాసుఁ డొకింత వ్యావహారికజ్ఞానము గలవాఁడు. కుటుంబపోషణ మీతఁడు తన భుజస్కంధముల వహించెను. ఇతని కొక సోదరీమణియుఁ గలదు. ఆమె పేరు తీర్థాదేవి. ఈ యిర్వురపిమ్మటఁ బెద్దకాలమునకు హీరానందునకుఁ బూర్వకృత తపఃఫలముగ నొక శిశువుదయించెను. అతఁడే ప్రాక్పశ్చిమ ఖండముల నద్వైతామృతవృష్టిచే ముంచియెత్తిన మహాజ్ఞాని రామతీర్థుఁడు.

గామము ప్రకృతిలో విచిత్రముగ జరుగుచుండును. తత్ఫలితముగ నిట్టి మహనీయు లుద్భవించుచుందురు. ఏది యెట్లైనను మాతృ హీనత తీఱని కొఱఁతయే. ప్రతి మానవుఁడును – పశు పక్ష్యాదులును – మాతృప్రేమను వాంఛించును. రామతీర్థుఁ డట్లు తలంచుటలో వైపరీత్య మెద్దియు లేదు. రామునితల్లి తన సూనుని వర్ధిష్ణువుగాఁ జూడఁగలిగిన నెంతటి యదృష్టవతిగఁ బరిగణనీయయై యుండెడిదో!

మాతృహీనుఁడగు రామునకిప్పుడు గోమాత శరణ్యామైనది. గోక్షీరముననే యతఁడు వర్ధిల్లెను. రాముని యక్క తీర్థాదేవియు మేనత్తయు నతనిఁ గడు గారాబముగఁ బెంచుచుండిరి. వీరిరువురును సహజముగ భక్తిపూరిత హృదయులు. వీరు దేవాలయమున కేగునప్పుడెల్ల నీ శిశువునుగొంపోవ మఱవరు. భగవద్దర్శనాదికములఁ గావించు నెడల నితఁ డేమాత్ర మల్లరి చేయఁడు శంఖధ్వానమున నుత్తిష్ఠనేత్రుఁడై ధ్యానమగ్నుఁడగును. పురాణ శ్రవణమన్నఁ నితనికి గడుఁబ్రీతి. ఈ గుణములన్నియు రెండేండ్లు నిండీ నిండని మన బాలరామునివే.

ఈ ప్రాయముననే యొకనాఁడు రాముఁడు గీపెట్టి యేడ్వఁ దొడఁగెను. ఏమి యిచ్చినను నేడ్పు మానలేదు. అపుడాతని తండ్రి దేవాలయమున కేగుచుండెను. బాలుఁ డాతనివైపు చూచుచు దీనముగా నేడ్చుచుండెను. అత్త యాతనిని తండ్రి కొసఁగెను. అతఁడా శిశువును చేకొని పురాణపఠనము జరుగుచున్న దేవాలయమునకుఁ గొంపోవ నేడుపు మానెను. ఈ సందర్భము చంద్రునికై పోరువెట్టిన రామచంద్రుని జ్ఞప్తికెలయిం

చును. ఒక్కొ-క్కెడ నేర్పు మాన్పించుటకు నితని శ్రవణపుహార మున నోంకారనాదము గావించెడువారు. ఆ యీడుననే ప్రణవ నాద మాతని కాఁకలిదప్పులనైతము మఱపించుచుండెడిది.

ఎట్లో యైదేండ్లవాఁడయ్యెను. ఈలోపుగ నాతఁడు రామా యణ భారత భాగవతాదులలోని పద్యముల నతిశ్రద్ధతో విను చుండెను. సారాంశముల గ్రహించుచుండెను. సందియములఁ బ్రశ్నించుచు సమాధానము లుపన్యసించుచుఁ బెద్దలఁ దన్మయులఁ గావించుచుండెను. ఇతఁ డాటపాటలలోఁ దోడి యీడుబాలు రతోఁ బాల్గొనఁడు. ఏకాంతవాసమునిన రక్తి మెండు.

## ప్రాథమిక విద్య

ఆర్ష సాంప్రదాయానుసారము తీర్థరామునకు నైదేండ్ల ప్రాయముననే యక్షరాభ్యాసము గావించిరి. మహామ్మదీయ మౌల్వీచే నడుపఁబడుచున్న యురుదూ ప్రాథమిక పాఠశాలలో నతనిఁ జదువఁబంపిరి.

అక్షరశిక్ష గావించుపని వాస్తవమున నుపాధ్యాయున కొకశిక్ష. ఏలయన బాలుని మనస్తత్త్వముగుర్తించి యాతని ధ్యానము నాటలనుండి మరలించి యక్షర లేఖనమునఁ జేయి కుదురఁజేయు టెంతయేని ప్రయాసము. పూర్వకాలపు టయ్యో వార్లు గుంటమోనమాలు దిద్దించిరి. చేతి వ్రేళ్ళఱుగ దిద్దగా దిద్దగా నెన్నాళ్ళకు నెందఱకు వర్ణ సమామ్నాయమంతయు వచ్చెడిదో? ఇది గట్టిచదువనియు నేఁటిచదు వోటిచదువనియు విశ్వ సించు మహనీయులు నేఁడును గలరు. దీనికిఁ గారణము నేఁడు

శిశు మనస్తత్వశాస్త్రము బోధనాభ్యసన పాఠశాలలో బర
సీయముగ నున్నను నాచరణమునఁ బూర్తిగా లేకుండుటయే.

సహజ బోధనా కుశలురు కొందఱుందురు. వారలు
శాస్త్రపఠన ప్రయాసలుపడకయే శిశు మనస్తత్త్వానుగుణ్యముగ
బోధింపఁ గలరు. అట్టివారిలో తీర్థరాముని యుపాధ్యాయుఁడగు
మౌల్వీ యొకఁడు.

మౌల్వీ రామునికి ఉర్దూభాషయందలి ప్రథమాక్షరమును
'అలిఫ్' అనుదానిని నేలపై దిద్దఁబెట్టెను. రాముఁడా యక్షర
మిచ్చు నర్థమేమని ప్రశ్నించెను. ఆయక్షరము ఏకత్వమును
సూచించును. పరిణామాక్షరార్థప్రతిపాదకము. ఈప్రశ్న వేసిన
బాలుని చిత్తసంస్కారమున కచ్చెరువంది మౌల్వీ యతని నెట్లో
బుజ్జగించి మనస్తృప్తిని గలిగించెను. ఆతని జ్ఞానతృష్ణ దీర్పను
బెంపొందింపను మౌల్వీ బద్ధకంకణుఁడయ్యెను. నాఁటఁగోలె
రాముఁడా యక్షరమే పరమార్థబోధకమును విశ్వవిజ్ఞాన సాధక
మునని విశ్వసించి యుండెను.

పాఠశాలలో బాలురందఱిలోఁ గడు చిన్నయయ్యు
విజ్ఞానమున మిన్నయై రాముఁడు గురుజనులకృపకుఁ బాత్రుఁడై
యుండెను. గురులయాజ్ఞ నెన్నఁడేని తిరస్కరించి యెఱుఁగఁడు.
తన కెప్పుడేని యాత్మోన్నతికి సాహాయ్యకముగ సెలవు వలసె
నేని గురుని యనుమతి పడయుట కెన్నియో పాట్లుపడును.
కాని యీకాలపు టున్నత పాఠశాలలలోని కొందఱు విద్యా
ర్థులవలె నుపాధ్యాయులఁ గనుబ్రామి పలాయనముఁ జిత్త
గించడు. అతనికిఁ బురాణశ్రవణము, దేవాలయ గమనము

పుట్టినదాది ప్రియంకరములు. ఒకప్పు డాగ్రామమున దేవాలయమునఁ బ్రతిదినము సాయంకాలము రెండుగంటలకుఁ బురాణకాలక్షేపము దివ్యముగ సాగుచుండెను. తీర్థరాముని మనసు తొందరింపసాగెను. పరాల్పి యంగీకరింపఁడు. అంగీకృతి బడయుటెట్లు? పడయక మనశ్శాంతి యెట్లు? తీవ్ర వేదనా దోదూయమాన మానసుఁడై గురుని సమీపించి సాగిలిపడి లేచి, "స్వామీ! కరుణింపుము. మధ్యాహ్నము భోజనమున కింటికిఁ బోక యిటనేయుండి మీరు సాయంకాలమిచ్చు పాఠములఁ బరిశ్రమింతును. పురాణశ్రవణమున కనుమతింపుఁడు" అని కడుంగడుఁ బ్రార్థించెను. దీనవదనుఁడైన శిష్యుని విన్నదనమును గురుఁ డవలోకించి హృదయము కరగి యతని కోరికను బ్రసాదించెను. భక్తికి భగవంతుఁడే గట్టుపడుచుండ దైవప్రతినిధియగు నుపాధ్యాయుఁడు పరుఁడగుట యొక వింతయా? అహా! భక్తి యెంత శక్తిమంత మైనది!!

ఇట్లతఁ డనుజ్ఞాతుఁడై యనుదినము పాఠమును బోఁగొట్టుకొనుచున్నను, పురాణమునువిని యింటికి వచ్చినంతనే తోడి బాలురనడిగి యొజ్జ గఱపిన పాఠములేవో తెలిసికొని రాత్రి యంతయుఁ బరిశ్రమించి మఱునాఁడుదయమునఁ బాఠశాలలో నేప్రశ్న వేసినను తడవుకొనక వెంటనే తగుసమాధానమిచ్చి గురుని మెప్పుకోలునకుఁ బాత్రుడగుచుండెను.

సాధారణ పాఠములం దద్వితీయ మేధావియై యుండుటయేగాక, రాముఁడు సామాన్య దురవగాహములగు పారశీక

కృతుల రెండింటిని గులిస్థాన్, బోస్థాన్ అనువానిని వర్ణించి మాల్వీ ప్రత్యేకాభిమానమును జూఱఁగొనెను.

సంయోగ వియోగములు ప్రకృతి ధర్మములు. సంయోగమున సంతోషమును వియోగమున విషాదమును బ్రాకృతు లొందుదురు. మహనీయు లీ ప్రకృతిధర్మము నధిగమింప వలంతులయ్యుఁ బ్రకృతి మహత్త్వమును బ్రదర్శింప మానవత్వమును సూచింప వియోగ విషాద మాధుర్య మనుభవింతురు. వాస్తవమునకు వారలకు సుఖదుఃఖములు సమములే. సీతాదేవి నడవికంపి శ్రీరాముఁడు ఆక్రోశించెను. శకుంతల నంపుచోఁ గణ్వుఁ డశ్రులరాల్చెను. నిజమునకు వీరలు ధీరోదాత్తులే, ధీరశాంతులే —

రామునకుఁ బ్రాథమిక పాఠశాలావిద్య పరిసమాప్తి యయ్యెను. వియోగము గురుశిష్యులకు ఘటిల్లనుండెను. శిష్యుఁడు తనకడ నుత్తీర్ణుఁడై యున్నత విద్యాగ్రహణ మర్థించి సెలవుగొంటకంటె గురునకు సంతోష కారణముండునా? కాని వినయ విధేయతలు బుద్ధికుశలతయుఁగల ప్రజ్ఞాశాలి తన శిష్యుఁడు తన్ను వీడిపోవు చున్నాఁడన్నఁ బరితపింపని యొజ్జయే యుండఁడు. తానున్నత విద్యాగ్రహణ లాలసుఁడై తన ప్రాథమిక పాఠశాలా విద్యావిజయమున కానందము విద్యార్థి పొందుట సహజమే కాని కరుణామయుఁడై తన పురోభివృద్ధికిఁ గారకుఁడైన గురుని చరణసన్నిధి దూరమగుటకుఁ బరితపింపఁడా యాదర్శ విద్యార్థి? అందుచే నీగురుశిష్యులకీ విశ్లేషణ సందర్భ మొకవైపు దుర్భర విషాదమునకును నింకొకవైపు అతివేల

సముత్సాహమునకును దావలమైనది, తీర్థుని హృదయమహతి 'ఖేదమా? మోదమా?' యను గీతిని నినదించినది.

## వివాహ తంతువు

కొన్ని శతాబ్దులుగ సనాతనాచారముగను సదాచారముగను బరిగణింపఁబడునది బాల్యవివాహము; ముక్కుపచ్చలాఱని ముద్దుబిడ్డలకుఁ బెండ్లితంతువు. ఔరా! పావనమగు గృహస్థ ధర్మస్వీకరణ మెంతటి యర్థరహితాచారముగఁ బరిణమించినది! ఈయాచారము మహాపురుషుల చరితములందును గోచరించి మన కొకింత వివేకము ప్రసాదింపఁ గారణమగుచున్నది. మహాత్ముని యాత్మకథలో నాతఁడు తన పసితనమున జరిగిన పెండ్లి నెటులు విమర్శన పాల్జేసినదియుఁ బాఠకలోకమునకు నూతనాంశము కాదు. కాని యామహాపురుషుల ధీరలక్షణముల ప్రభావమున నీదోషము గుణముగనే మనకుఁ దోఁచును. కస్తూరిబాయి మహాత్ముని కర్థాంగలక్ష్మియు నవవయస్కయు బాల్య వివాహలబ్ధయు నైనందున నేమిదోషము ఘటిల్లెను? ఆమెయే యమ్మహామహుని జీవిత భాగస్వామిని గానిచో నతనిచరిత్ర మెట్టిమార్పులు కలిగియుండెడిదో! శ్రీ రామకృష్ణ పరమహంసులవారు ఆఱేండ్ల బాలికను శారదామణినిగదా పెండ్లాడినది. శ్రీవారి యకలంక బ్రహ్మచర్యనిష్ఠ కెట్టిలోటు వాటిల్లినది? ఏరుచిగల నీళ్లైనను సముద్రమును జేరుటతోడనే యుప్పనీరైనట్లు, బాల్యవివాహము గానిండు ప్రౌఢ వివాహముగానిండు; అది ఆయాబాలికలకు మహనీయులగు భర్తల పాదరజోలేశము స్పృశించినంత నాంతరంగిక పరి

వర్తనము దెచ్చి యైహికలోలుపత్వము దొలఁగించి యాదర్శ గార్హస్థ్యమున కనుకూలతఁ గూర్చును. ఇది విశిష్ట విషయ మననేగాని వైవాహికానందము, వాస్తవప్రేమ, భార్యాభర్తృ సన్నిహిత సంబంధము, బాధ్యతా నిర్వహణమున హృదయ నైర్మల్యము అనువాని సందిపుచ్చికొనుటలో ప్రౌఢవివాహము తోడ్పడునుగాని బాల్యవివాహము తోడ్పడ నేరదు. బాల్యవివాహితులకు విద్యావివేకము లాను వంశికములుగ రావలసినవియేగాని విద్యాశాలలలోఁ బడయఁ దగునవి కావు. ఈకారణమున స్త్రీవిద్యకే బాల్యవివాహ మొక గొడ్డలిపెట్టు. మఱియు బాల్యవివాహితదంపతులు బాలవితంతువుల సృజించుటలో సహకారులనియు ననుభవజ్ఞులు పలువురు చెప్పియున్నారు.

తీర్థరామగోస్వామి పదియేండ్ల పసివాఁడు. తండ్రి హీరానందుఁడు తనబిడ్డఁడు వివాహితుఁడై యుండఁజూచి మురియఁదలఁచెఁ గాఁబోలు. తనకుఁ బూర్వ సంబంధముగల రామచంద్రుఁడను నొక బ్రాహ్మణుని వియ్యంకుని గావించుకొనెను. రామచంద్రుఁడు వజీరాబాదుజిల్లా 'వెరోకే'పురవాసి. అతనిపుత్రికి ఆసమయమున వయస్సెంత యుండునో యూహింపవలసినదే. అదృష్టవశమున భర్తకంటె వయస్సధికముగల భార్యలఁ బెండ్లాడు నాచార మింకను మనదేశమున వ్యాప్తిలోనికి రాలేదు. ఈబాలదంపతులకు వివాహోద్దేశమేమి తెలియును? ఆ బాల కీబాలకుఁ డొక నూతన మిత్రుఁడు; ఈబాలున కామెయు నొక క్రొత్తనెచ్చెలి. ఐనను వారికి సిగ్గుతెర మధ్య నుండకపోదు. బాలుఁడు దాను భర్తనను భావ

మునుఁ దల నొకింత పైకిఁ ద్రిప్పక మానఁడు. బాలిక తాను భార్యనను భావమొకింత తలఁపునందైన యుండకపోదు. తలఁ బ్రాలు పోసికొనునపుడు, నూరేగింపులు జరుగునపుడు, వసంతోత్సవములు జరుపుకొనునపుడు, నిజమైన కానంద మంతయు నీ బొమ్మల పెండ్లిండ్లు జరుపు పెద్దలదనియే మనము దలఁప వచ్చును. తాము బాల్యవివాహితులగుటచే వివాహా నందము నాఁడంతగాఁ బొందని కొఱఁతను దీర్చుకొనుటకో యీయుత్సవములలో వృద్ధదంపతు లుత్సాహ పూరితులై పాల్గొందురు.

## ఉన్నతపాఠశాల - ధన్నాజీ గురుత్వము

మురళీవాల యొక కుగ్రామము. అందున్నది యొక ప్రాథమిక పాఠశాలయే. ఆనాఁడున్నత పాఠశాలలు నేఁడట్లు జనపదములకుఁ బ్రాకలేదు. ఉన్నత పాఠశాల యేపట్టణము ననో యుండెడిది. అందుచే రాముఁ డున్నత విద్యాశాలకొఱకుఁ దన యూరికిఁ బదునేనుమైళ్ళ దూరమునఁగల మండలకేంద్ర మగు గుజరన్వాలా కేగవలసిన వాఁడయ్యెను.

అప్పటి కాతఁడు పది వసంతములు గడపెను. తల్లియా? లేదు. తండ్రియా? అతఁడేమో! అతని శిష్యసంచారము లేమో! అన్నయున్నఁ గుటుంబ వ్యవహారములఁ జక్కదిద్దుకొనవలసిన వాఁ డాతఁడే. ఇఁక నితని వెంట నెవ్వరు చదివింప వత్తురు? అతి బాల్యము. స్వతంత్రశక్తి యణుమాత్రముండదు. సంరక్షకుఁ డావశ్యకము.

చదివినదేదో చాలును; ఎట్లో తనపొట్ట తాను బోసికొనలేక పోవునాయని తండ్రి యూరకొందమన్న నతనికి "తీర్థరాముఁ డున్నత విద్యాగ్రహణమునఁ బ్రకాశించుననియు, జదివింపఁడేని కొమరునకుఁ దాను గీడొనర్చిన వాఁడగు"ననియు నుపాధ్యాయులు దమ యభిప్రాయమును దెలిపిరి. రాముడాంగ్లమున నుత్తీర్ణుఁడై యుద్యోగము సంపాదించి తన్నుద్ధరింపఁ గలఁడని హీరానందుఁ డాశించెను. జ్యేష్ఠపుత్రునితో నతఁడీ విషయమున సమాలోచింప నతఁడార్థిక సాహాయ్య మొకింత జేయ నియ్యకొనెను. బంధుమిత్రులును, 'నేమున్నాముగదా?' యని ప్రోత్సహించిరి. రాముడు 'పరమేశ్వరుఁడున్నాఁడుగదా' య్యని యనుకొనెను.

రామునికి రక్షకత్వము వహింప నెవ్వఁడా యని హీరానందుఁడొకింత యాలోచించెను. అట్టివాని కొఱకంతగా నన్వేషింపఁ బని యుండదని వేఱుగ నుడువవలయునా? అనురాగపూర్ణుఁడును స్వధర్మపరాయణుఁడును నిరంతరప్రవర్ధనశీలుఁడును నగు వత్స నిజోత్సంగమున వసతి గోర సహృదయుఁ డెవ్వఁడు ద్రోయఁగలఁడు? అత్రిమహాముని తనయొద్దకు మురళీధరుఁడై ముద్దులొలుకు మూఁడేండ్లప్రాయపుఁ బసికూన రూపువాఁడై వీరనారాయణుఁడు (బ్రహ్మముగారు) రాఁగాఁ దనయాశ్రమమున జోటీయలేదా? అనుఁగు బిడ్డలఁబెంచు కర్తవ్య మెంత మధురభావపూరితము! అదియొక యమృతానంద వీచియే యందము.

గోస్వామి హీరానందునకుఁ గలఁ డొక సుహృద్వతంసము! భగవద్ధన్న రాముఁ డాతనిపేరు; అతఁడొక యద్భుత

చేతురు. ఆ మహాదద్భుత విచిత్రవ్యక్తి దక్షకత్వమున నతి శైశవమందే సుశిక్షితుడగుట రాముని యదృష్టము. మనము కథావస్తు పరిశీలనమున నీ చిట్టిగోస్వామి లక్ష్యములపై ధన్నాజి తేజమెట్లు ప్రసరించెనో గమనింతము. మొక్కగ నుండగనే నీరువోసి పరిపోషణము గావించిన యాతోటమాలి జీవితమునొకింత సమీక్షించుట కర్తవ్యము కదా!

ధన్నాజీ జహారిమల్లు నామధేయుఁడగు నొక తామ్ర పారిశ్రామికుని కుమారుఁడు. శిల్పు లీనాఁడు యంత్రప్రభావమున సంఘమునఁ బ్రాధాన్యమును గోల్పడియున్నారు. పూర్వయుగమున వీరి ప్రాధాన్య మద్వితీయము. వీరిలోఁ బలువురు బ్రహ్మర్షి పుంగవులు. వీరు వైదిక లౌకిక క్రియలెఱింగిన దిట్టలు. శిల్ప ప్రభావమునఁ బ్రజలలో ఆస్తిక్యమును బ్రబలఁజేసి యాచార్య నామాంచితులై యాధ్యాత్మిక తత్త్వసంపన్నులై నెగడినవారు వీరే. 'ధన్నాజీ' యాధ్యాత్మిక గురువై రామతీర్థుని యమేయ మహత్త్వమునకుఁ గారకుఁడై యుంట యీ యాశయమును బలపఱచు చున్నది.

ధన్నాజీ తన భవిష్యచ్ఛిష్యునివలెనే బాల్యముననే తల్లిని గోల్పోయెను. తండ్రి నిఱుపేదయగుట బాలుని సాధారణ పాఠశాలకే పంపెను. బాలుఁ డితరబాలురమించి, యాచార్యుని ప్రత్యేక సమాదరమునకుఁ బాత్రుఁడయ్యెను. అందుచే విశిష్టతకు సూచకముగా నితని నుపాధ్యాయుఁడు మిగిలిన బాలురందఱి కన్న మున్నుగా నింటికిఁ బంపువాఁడు. ఇది యాకాలమునఁ దెలివిగల బాలుర గౌరవించు విధానములలో నొకటియై

యుండవచ్చును. పాపము! ఈ గారవమతనికిఁ గీడునే కలిగించెఁ గాని మేలు చేకూర్పలేదు.

ఇతని యగ్రగణ్యత పలువలకుఁ బలువగలు గలిగించెను. వారు తమ కన్నెఱ్ఱను బాయ మార్గ మన్వేషించుచుండిరి. 'అన్వేషించిన నది లభింపఁగలదు', అను సామెత సన్మార్గ గాములకుఁ గాక దుష్ప్రవర్తకులకే యెక్కు డన్వయించును. ఏదో సాకు దొరకినది. ఈతులువ లందఱొకఁడై యేదోకల్పించి యాతనిపై నేరమారోపించి గురునియెదుట ఋజువుచేసిరి. తీర్థరాముఁ డెంతయత్నించినను 'పలుకవురాడుమాట పాటియై ధరఁజెల్లు నొక్కఁ డాడుమాట యొక్కడెందు' అనువేమనసూక్తి యచట యథార్థమైనది. నేరస్థునికిఁ బండకొయ్య వేయఁబడెను. బాలురందఱి బాలునికిఁ జెంపదెబ్బలు వేయవలెను. ఆకాలపుఁ బాఠశాలా దండనము లిట్లుండెఁ గాఁబోలు!

తీర్థరాముఁ డాత్మగౌరవముగలవ్యక్తి. ఈదండన మతనికి మిక్కుల నన్యాయముగను క్రూరముగను దోఁచినది. తత్క్షణ మాతఁ డింటికిఁ బోయి దానికిఁ బాఠశాల కేగననియు వెళ్ళుమని బలవంతము సేసిన నిలు వెడలెద ననియు ఖండితముగఁ దన తండ్రికి తన నిశ్చితాభిప్రాయమును దెలిపెను. తల్లిలేని బిడ్డఁడు. తండ్రి యేమిచేయఁగలఁడు? అతని యకుంఠిత నిశ్చయమును మఱల్ప సాధ్యము గాదు. కావున నతనిఁ దన వ్యాపారమునఁ దనకు సాహాయ్యకుఁడుగ నియోజితు నొనర్చెను.

ఒకప్పు డాతఁడు కాటసరాజను స్థలమున జరుగు సంతకుఁ బోయెను. అచటినుండి తిరిగివచ్చునపుడు పిండ్ దాదన్ ఖాను

నొద్దఁగల తామ్ర పరిశ్రమాలయముఁ గాంచి దానిచే నాకృష్టుఁడై యచట తన వ్యాపార మారంభించెను. అప్పు డాతఁడు ఇంచుమించు యిరువది వత్సరముల వాఁడు. ఈకాలమున నాతడు కుస్తీమొదలగు వ్యాయామ క్రీడలలోఁ బాల్గొను చుండెను. విశ్రాంతి యేమాత్రము లభించినను కళల యందత్యంత ప్రయోజనకారియగు వ్యాయామమునఁ దీవ్రకృషి యొనర్చుచు, “శరీరమాద్యమ్ ఖలు ధర్మ సాధన”మ్మను నార్యోక్తిని సార్థక మొనర్చుచుండెను.

ప్రఖ్యాతుఁడగు వస్తాదొకఁడువచ్చి సవాలు చేసెను. ఆ సవాలునకు ధన్నరాముఁడు సహింపఁజాలక పోరున కాయత్త మాయెను. ఇతఁడా? చిఱుత వాఁడు. అతఁడా? ‘అనేక యుద్ధముల నాఱియుఁదేఱిన — మూర్తి’. ఈతరుణుఁ డీతరుణమున విజితుఁ డగుననియే మిత్రులు తలఁచిరి. ఆతని నాయత్నము నుండి మరలుప యత్నించిరి. ‘యశోవా మృత్యుర్వా’ యని యతని సమాధానము.

కుస్తీజరిగెను. మహా బలయుతుఁడగు నాతఁడీ బాల హార్యక్షము నెఱుఁగక క్రిందికదిమిపట్టెను. ఇతఁడో నేలపై బోరగిల పడెను. ఆసమయమున నితఁడు పెనఁగిన వితము — వర్ణింప నలవిగాదు. ముచ్చెమటలు పోయుచున్నవి. ఫీటగుట లేదు. ఇట్లతఁడు విసిగి వేసారి రొప్పుచు రోజుచునున్న తరుణమున నాకస్మికముగ నెప్పుడు ధన్నరాముఁడు పైకి వచ్చెనో యేమో యత్యాశ్చర్యకరముగ నామల్లుని వీపున దుమ్ముగునట్లు పడఁగొట్టెను. జనులు ధన్నరాముని పేరెత్తి జయజయ ధ్వానములు గావించిరి.

మొగ్గగా నుండినపుడే త్రుంచివేయఁబడుటచే నాతనికిఁ జనప్ర వర్ణసమామ్నాయముతోడనే నిల్చిపోయెను. కాని అతఁడు భారతేతిహాస శ్రవణకుతూహలియై శ్రద్ధాభక్తులకు నెలవై జిజ్ఞాసాధురంధరుఁడై యుండెను. సుదాముని చరితము వినినపుడు గన్నీరు మున్నీరుగాఁ స్రవించుట నాపుకోఁజాలకుండెను.

అతఁడు తీక్ష్ణ గ్రీష్మాతపమున దుప్పటులు గప్పుకొనును; ఎముకలఁ గొఱికివేయు శీతకాలమునఁ జైగుడ్డయులేక కేవల కౌపీనతుల్యమైన వస్త్రమాచ్ఛాదనముగఁ గలిగియుండును. అన్నము దినునపు డెన్నఁడు నీరు గొనఁడు. దినములపర్యంతము పకపక నవ్వుచుండును. ఒక్కొక్కప్పుడతి విచిత్రముగా మూకీభావము వహించుచుండును. ఇట్లాతఁడు మనశ్శరీరములపై నధికారమును వహించెను. పగ్గములఁ బట్టి యశ్వములఁ దన యిచ్చకు లోఁగఁ జేయు వాఁడే గదా యారితేరిన రౌతు.

అతనికే దేని వేదాంతవాక్యము శ్రవణగోచర మయ్యెనేని తత్క్షణమ దాని నాచరణమునఁ బ్రయోగించి ఫలాఫలములఁ బరమేశ్వరార్పణము గావించును. ఒకచో మానవుఁడే మాధవుఁడనియు మానవారాధనమే మాధవారాధన మనియు వినెను. నాఁడు మొదలాతఁ డెవని నేని 'బ్రహ్మము' అని పిలువఁ దొడఁగెను. ఎల్ల రాతని నా పేరుననే తిరిగి వ్యవహరించుచుండిరి. ఇట్లు లాతఁడు పరబ్రహ్మనాముఁడై భగవత్స్వరూపుఁడుగఁ బ్రఖ్యాతుఁ డయ్యెను.

అప్పుడప్పు డాతని భావములు ఆవేశపూరితములై కవితా స్రవంతికలై జాలువారును. అతని గేయములు నిత్యనూత

సములై సహజ భావావేశము గలవియని రామతీర్థుడు పలుమఱు కొనియాడెను.

కాని ధన్నరామునికి జాలకాలమువఱకు గురువు లభింపమి జీవిత పరిపూర్ణపక్వదశ సుదూరముగనుండెగని యసంతృప్తుఁడై నిత్య పరితప్త హృదయుఁడై యుండెను.

యోగ్యతకొలఁది సన్నివేశములు సంభవించుచుండును. ఒకనాఁ డాతఁడు గుజరన్వాలా కేగి యందొక మహర్షిని సందర్శించెను. పేదకుఁ బెన్నిధి లభించెను. వాని యానందమునకు మేరయుండునా? నాటితో నాతనికిఁ గృతార్థత. ఆ సాధుపుంగవునకు ధన్నరాముఁడు హృదయమును విప్పి, " ఆర్యా, నాకు బాహ్యసౌఖ్యమునకుఁ గొదువలేదు. కాని నా యాత్మ శాంతిని గోరుచున్నది. అది నిష్పచ్చర మగుచున్నది", యని వేదనాసర్వస్వ నివేదనము గావించెను. ఆ మహాత్ముఁ 'డీతఁడు యోగ్యుఁడు సంసిద్ధుఁడు'నని తలంచి, శిష్యునిగఁ బరిగ్రహించి, యతనికి సదుపదేశము ననుగ్రహించెను. అతఁడు 'సర్వము నాత్మకే యర్పించి యితరమంతయు మఱచి పో'మ్మని జ్ఞానరహస్యమును, సూక్ష్మములో మోక్షమును, సూచించెను. ఆ ప్రకారమే యతని యెదుటనే ధన్నరాముఁ డొనర్చి, గాఢ సమాధి నిష్ఠుఁ డయ్యెను. సమాధ్యవస్థనుండి జాగ్రదవస్థకు వచ్చునప్పటికి గురుఁడు తిరోహితుఁ డయ్యెను. అతనికిఁ గలిగిన యాశ్చర్య విషాదము లనుభవైక వేద్యములే. కాని యతఁడు పూర్తిగ నిరాశఁ జెందక పరిపూర్ణ విశ్వాసముతో గురూపదిష్ట సదభ్యాసములఁ గొనసాగించుచునే యుండెను.

అతనికి గురు పునర్దర్శనభాగ్య మచిరకాలముననే లభించెను. గురుఁ డీ పర్యాయము శిష్యుని వెంటఁగొని యరణ్యములకేగి యతని బరీక్షించి తన బోధన మతఁ డనుష్ఠించి కృతార్థుఁ డగుటకు సంతసించి, యతని కష్టసిద్ధులఁ బ్రసాదించి, భావిస్థితిని బ్రబోధించి, జీవబ్రహ్మైక్యసిద్ధినాశీర్వదించి యదృశ్యుఁడయ్యెను.

అంతట ధన్నరాముడు సిద్ధుఁడై యద్భుత కార్యములఁ జేసి ప్రజాకర్షణమునఁ బ్రబలుఁడయ్యెను. అతనికీర్తి దశదిశావ్యాపృత మయ్యెను.

ఏతాదృశుని రక్షకత్వము రామునికి భాగ్యవశమునఁ బ్రాప్తించెను. యోగ్యతయే భాగ్యమునకు సరియైన కారణము. అయోగ్యుని కెట్టి భాగ్యము సంప్రాప్తించినను నిరర్థకమే.

హీరానందుఁడు రాముని వెంటఁగొనివచ్చి ధన్నరామున కప్పగించెను. ధన్నరామున కీ బాలుని గనుగొని నంతన పుత్త్ర వాత్సల్య ముదయించెను. రాముని ముఖమున హృదయ నైర్మల్యము ద్యోతకమగుచుండెను. మృదు కపోలములపై చిఱునవ్వు తాండవించుచుండెను. చిఱు బుగ్గలపై గులాబులు పూచుచున్నట్లుండెను. కనులలో నమాయికత గానవచ్చుచుండెను. ఈ బాలుని వినయవిధేయతలు సురూపము నా వృద్ధుని ముగ్ధుని గావించెను. బాలున కాతఁడొక మహావ్యక్తిగ గోచరించెను. ఆతఁడేమో తన యంతస్తాపమును బోఁగొట్టఁ గలఁడను నాశ యతని హృదయమునఁ దోఁచెను. తండ్రి యతనికడ విడిచిపోయినందున నతనికెట్టి లోటును వాటిల్ల లేదు. ధన్నాజీ తన యద్భుతశక్తులఁ బ్రదర్శించి యవి దైవ

కటాక్ష లక్షణములని రామునకుఁ దెలిపెను. రాముని హృదయ క్షేత్రమున ధన్నా రాముఁడు సదుపదేశబీజముల వెదఁజల్లెను. ధన్నాజీ యనుమేఘము సమ్యగ్వృష్టిని గురియించుచుఁ దద్బీజము లంకురములై పెరుగుటకుఁ గృషిమొనర్చుచుండెను. ఒకవంక నున్నతపాఠశాలా విద్యయు మఱొకవంక నున్నత వేదాంత విద్యయుఁ గఱచుచుండెను. నాలుగైదు వత్సరము లట్లుఁ జదివి యుండెను. ఈ నాలుగైదు వత్సరములలో నతఁడు వడసిన యాధ్యాత్మిక తత్త్వజ్ఞానోన్నతియే యతని నత్యున్నత హిమశిఖరములకుఁ గొంపోయినది.

ధన్నరాముని గుణము లన్నియు రామతీర్థుని కలవడినవి. అతని జీవిత మీతని జీవితమున కొక స్వచ్ఛమైన దర్పణము. అతనికిఁగల భక్తి, శక్తి, దైహిక మానసిక విజయము, వ్యాయామ ప్రీతి సర్వము నితఁడు గ్రహించెను.

గురుభక్తియం దద్వితీయుఁడుగ బాల్యముననే పొగడొందిన రాముఁ డీ తరుణమున గురుభక్తి యెంతగఁ గలిగియుండెనో తెలుప నశక్యము. యావజ్జీవితము నతనికి దాసుఁడై యతని యాజ్ఞానుసారము జ్ఞానమార్గమున వర్తింతునని శపథమొనర్చుచు నతని చరణకమలముల కాత్మార్పణ మొనర్చెను. అతని వియోగము నొకింతయేని సహింపలేని గాఢానురాగమున మెలఁగుచుండెను.

ఒకప్పుడు వేసవిసెలవులకుఁ దీర్థరాముఁ డత్తవారింటికిఁ బోయి యందు వసించుచుండెను. అత్తవారీ యల్లునియెడ నత్యంతము ప్రీతియుక్తులై యనేకవిధములగు పిండివంటలు సేసి

పెట్టుచు నెంతగనో గౌరవించుచుండిరి. శ్వశురగృహ నివాసము స్వర్గతుల్యమని యందురుగదా. కాని రామతీర్థునకు గురు సాన్నిధ్యము కొఱవడుటచే నతని యాత్మ పరితపింపఁ దొడఁగెను. " ఒడలు మాత్ర మిచటఁ బడియుండెనేగాని ప్రాణమంత నీదు పజ్జఁ జేరె " అను స్థితిలో నుండెను.

వెరోకె గ్రామమునకుఁ గొన్ని మైళ్ళదూరమున బడోకె అను గ్రామము గలదు. అచట తిరునాళ్లు ప్రతి వత్సరము జరుగుచుండెను. అచటికిఁ దాను దప్పక వత్తునని ధన్నరాముఁడు రామునకుఁ దెలిపియుండుటచే గురుసందర్శన కుతూహలమున రాముఁడు నడచిపోయెను. కాని గురుఁ డేకతముననో రాఁజాలక పోయెను. శిష్యుని మనఃపరితాపము ద్విగుణీభూత మయ్యెను. అతఁ డాచార్యుఁడు రాకుండుటకుఁ దనయందేదో దోష ముండ వలయునని తలఁచెను.

తన మనోవేదనను గురునకు వ్యక్తీకరింపవలయును. తన దోషముల మన్నింపుమని వేడవలయును. మార్గమేది? ఎక్కడనో యున్నవారి కెక్కడో యున్నవారు తమ భావములఁ దెలుపుకొనుటకు ప్రాథమిక సాధనము లేఖ. నిజమునకు లేఖలో భావ వ్యక్తీకరణముచేసి నంతగా లేఖకుఁడు స్వయముగా వ్యక్తీకరింపఁ జాలఁడు. లేఖలోఁ దన భావముల నొకచో నేకాగ్రమొనర్చి రసవంతమగు రచనలోఁ బ్రచురించును.

ఆ గ్రామమున తపాలకచ్చేరి లేదు. చాలదూరమునఁగల తహసిల్ హెడ్ క్వార్టర్సునకుఁ బోయి యచట కార్డును గొని రెండొక యుత్తరమును వ్రాసి పై విలాసమును జక్కగా లిఖించి

తపాలాపెట్టెలో వైచెను. అనియే యతఁడు తన గురునకు వ్రాసిన మొదటిజాబు. అందాతఁడతని సంబోధించిన క్రమము గమనింపుఁడు: "శిష్యులకు మార్గదర్శకుఁడా, గురుమహారాజా!" ఈ సంబోధన మతనికి గురునియందుఁగల యఖండ విశ్వాసమునకు నిదర్శనముగదా ! అదిమొదలాతఁడు ధన్నాజీ కిట్టి యుత్తరము లెన్నో వ్రాసెను. వానిసంఖ్య 1100 లకు మించి యుండెను. అవి యన్నియు "ఇక్కడ క్షేమములు. అక్కడ క్షేమములు తెలుపవలయును. ఇంతేసంగతులు, చిత్తగింప వలయును" అను ధోరణిలో వ్రాయఁబడు నిరర్థక లేఖలుగావు. అవి యఖండామృత భావరసతరంగిణులు. అత్యున్నత నిసర్గభావ ప్రకటనకు నిదర్శనములు. వాఙ్మయమున వానిస్థానము ప్రశంసనీయము. అవి తాత్కాలిక ప్రయోజనము సాధించుట కుపకరించుటయేగాక భావికాలపు విద్యార్థికోటికిఁ బఠనీయములై యొప్పుచున్నవి. ఈ లేఖల నన్నింటిని సేకరించి రామతీర్థుని శిష్యకోటిలో నగ్రేసరుఁడగు స్వామి నారాయణుఁడొక పుస్తక రూపముగఁ బ్రకటించెను. ఈ లేఖలకుపోద్ఘాతము వ్రాయుచుఁ గాంబోలు నతఁడు ధన్నరామునిగూర్చి యిట్లు వ్రాసెను.

"ఎవని కరుణాపాంగములు రాముని విశ్వవిఖ్యాతికి హేతువు లయ్యెనో, అతఁడు ధన్యుఁడు. ధన్యమూర్ధన్యుఁడు ధన్నాజీ. ఎవఁడు స్వామికాచార్యుఁడును, సంరక్షకుఁడునయ్యెనో; అతఁడు కృతకృత్యుఁడు. ఎవఁడు రామునకు గురుఁడై వేనవేలు ప్రజలు సంసారసాగర సంతరణోపాయ సంగ్రహము సలుపఁ దోడ్పడెనో– అతఁడుధన్నాజీ–ముమ్మాటికిఁ జరితార్థుఁడు."

గజమున కీ ప్రశంసకు ధన్యాడీ తగినవాఁడే. సందియము లేదు. ధన్యాడీ గురుత్వమే రాముని భవిష్యదాఢ్య చరిత్రకు మూలము. పూర్వజన్మ సంచితమున నాత్మ ఫలించినపుడు, దున్నిన పొలమునకు వచ్చు వర్షమువలె గురుఁడు తనంతట తానే వచ్చును. ఈ భావమున కీ గురుశిష్యుల చరిత్రములు నిదర్శనములుగదా !

## కళాశాలా జీవనము

రామతీర్థుఁడిప్పు డున్నత పాఠశాలావిద్యను బూర్తి గావించినాఁడు. అతఁడు ప్రవేశపరీక్షయందు పంజాబు రాష్ట్రమంతటిలోఁ బ్రథమశ్రేణిలో ముప్పది యెనిమిదవ వాఁడుగఁ గృతార్థుఁడయ్యెను. ఈవిద్యా యోగ్యతతో నేదో యొక చిన్న పరిభుత్వోద్యోగము, గుమాస్తాగిరి వంటిది సంపాదించుకొన వచ్చును. దానితోఁ దండ్రికష్టములు గట్టెక్క-వచ్చును. ఇపుడు భార్యయు యుక్తవయస్క-యై భర్తృ గృహవాసయోగ్యత బడసియున్నది. ఈ కేరిసపిల్లను పుట్టింట నెంతకాలమని యుం తురు ఆమె తలిదండ్రులు? ఈ కారణములన్నియుఁ బురస్క-రించుకొని హీరానందుఁడు కుమారుని విద్యార్థి జీవనమునకు స్వస్తిచెప్పి గృహస్థ జీవనమునకు స్వాగత మీయుమని కోరెను.

తీర్థునకు విజ్ఞానతృష్ణ మెండు. విద్యాసాగర మవ్వలి గట్టు చేరనిది దనకుఁ దృప్తిలేదను నిర్ణయమునకు వచ్చెను.

నిర్ణయమునకు వచ్చుట కష్టముకాదు; నిర్ణీత కార్యమును నిర్వహించుట సులభమును గాదు. కార్య నిర్వహణమున కెన్నియో యాటంకములు. వీనిని గడచినఁగదా కృతార్థత.

ఇచట తండ్రి కొడుకుల యభిప్రాయములు భిన్నము లైనవి. తండ్రి తాత్కాలిక ప్రయోజన మపేక్షించెను. కొడుకు శాశ్వత ప్రయోజన మాకాంక్షించెను. ఒకఁడు బాదము విత్తనము పాఁతఁబెట్టి పప్పును తింద మనును. మఱియొకఁడా విత్తును పెంచి పాదులోఁబోసి మొలిపించి యట్టివాని నెన్నింటినో పొందింతమనును.

ఈయిద్దఱకు భావ వైరుధ్యము ఘటిల్లినది. ఉన్నత విద్యా పారంగతత్వ మభిలషించు కుఱ్ఱనికి తుచ్ఛమగు జీవన భృతిమాత్ర సంపాదనము మనసున కెక్కునా? ఉన్నతాదర్శమున కుఱ్ఱిపోవుచుండు తనయుని సంకుచితవృత్తికి లాగఁజూచు తండ్రి నెంత త్రోసి రాజనినను, కుమారుఁడు పితృభక్తి విహీనుఁడుఁ గాలేదు. 'తండ్రీ, హరిఁ జేరుమనియెడు తండ్రి తండ్రి' యనిన ప్రహ్లాదకుమారుని పలుకులు పాటింపఁదగినవే.

హీరానందుఁడు పట్టుదల గలవాఁడు. అతఁడు తీర్థరాముని దీక్షనుదొలఁగింప విశ్వప్రయత్నములు గావించెను. చతురుపాయచతురుఁడై తుదకు రామునికిఁ దానొక కాసైన సాయము చేయనని బెదరించి యిలు వెడలనడచెను. 'నీభార్యను నీవే పోషించుకో ఎవఁడెవని భార్య నెన్నాళ్ళు పోషింపఁగలఁ', డని పలుకుచుఁ దీర్థరామునికడ కతనిభార్యను సైతము బంపెను

హీరానందుని తీవ్రవిమర్శకుఁ బాల్పడితిమి. వాస్తవమున కతఁడేమి చేయఁగలఁడు? పరిస్థితుల యొత్తిడి యట్టిది. తన కుమారుఁడీ బెదరింపునకు లొంగి తనమార్గము ననుసరింపఁ గలఁడని యపోహ చెందెను. అతఁడెంతటి ధీరోదారుఁడో

యాతఁడెఱుఁగఁడు. సంసారపు బరువు మోయుటలోఁ జదువు సంధ్యలు సాగక యింటికిఁ దిరిగి రాఁగలఁడనియే యతని దృఢ విశ్వాసము. పదునాలుఁగేండ్లు గడచి పదునైదవయేఁటఁ గొలఁది మాసములు మాత్రము గడపిన రాముఁడా స్వతంత్రించి విశ్వవిద్యాలయ విద్యాభ్యాసమునకుఁ గడంగుట? ఏ యాధారమును జూచుకొని యాతఁడీ సాహసమున కుద్యమించుట?

పవిత్రహృదయు లెన్నఁడును దమ పవిత్ర సంకల్పములకుఁ దిలోదకము లిడరు. తమ లక్ష్యములఁ జేరుదనుక వెనుక చూపు వీరికుండదు. దుర్భర పరిస్థితుల పాకఁ గాగి జ్ఞానశక్తిని బ్రజ్వలింపఁజేయుటయే సామర్థ్యము.

పసితనముననే తల్లినిగోల్పోయినకతమునఁ జిన్నతనమునఁ దగిన పోషణము లేకపోయెను. తత్ఫలితముగా నాతఁడు బలహీనుఁడై పలుమాఱు వ్యాధిపీడితుఁడై యుండెను. అయినను నతఁడు పడకపెట్టక ఏదొక పాఠమునైన వినువనొల్లక కళాశాల కేగుచుండెను. అప్పుడప్పుడు ధన్నాజీ వచ్చుచు ధైర్యమును బురికొల్పుచుండెను. వినను ఈ యాతన కడు దుస్తరము. తీర్థరామునకుఁ గష్టసహనశక్తియు విస్తారము.

ఈ బాలునకు భార్యాపోషణ భారమొకటి; యింటియద్దెయొకటి; ధన్నరామునకుఁ జేయవలసిన ద్రవ్యసాహాయ్యము మఱియొకటి; యిట్టి యిక్కట్లెన్నియో! ఇన్నింటికెట్లు ధనము వచ్చెడిదో చిత్రము! అంతకు మించిన చిత్ర మింకొకటికలదు; ఏమన:— ఈ వ్యయములకుఁబోను దినమునకు మూఁడు కానులు మాత్రము మిగులఁ జొచ్చెను. ఈ స్థితి యొక నెలయంతయు

నుండెను. ఈ మూఁడుకానులతో నతఁడు తృప్తిపడ నిశ్చయించి నాఁడు. 'ఎందుకు దరిద్రనారాయణులు లోకమున మూడుకాసులతోఁ దమపొట్ట నింపుకొనుటలేదు?' అని సమాధానము చెప్పుకొన్నాఁడు. ఒక పంజాబీ రొట్టెలవర్తకుని కొట్టునకుఁ బోయి యుదయము రెండుకానులకు సాయంకాలమొక కానికి రొట్టెలను గొని వానిని దిని యిన్నినీళ్లు ద్రావి యెటులో దినములు పుచ్చుచుండెను. ఆ వర్తకుఁడు, 'మూఁడు కానులకు మూఁడు రొట్టెలుగాక నీకు వానిలోఁ గూరయు నూరక యీయవలసి వచ్చినది.' అని రెండుపూటలా మూఁడు కానులకు రొట్టెలీయ నిరాకరించెను. అన్నమయకోశము నధఃకరించిన యాత్మకీ నిరాకృతి యొక లక్ష్యమా? రాముఁడానాఁడు మొదలామాసము దినములును నుదయమో సాయంకాలమో యొకపూట మాత్రమే యా వర్తకుఁడిచ్చు రొట్టెను మహాప్రసాదముగ భావించి స్వీకరించుచుండెను. 

ఇటులాతఁడు విద్యార్థిదశయందు దుర్భరదారిద్ర్య మనుభవించుచుండెను. ఐనను కష్టపరంపరలకు జంకుగొనక యన్నింటి ననుభవింప సంసిద్ధుఁడై యుండెను. అతనిభార్య స్వయముగాఁ గుట్టిన ముదుకగుడ్డలు అతనికి దుస్తులు. ఒక యంగీయు నొక శ్రౌజరు నొక తలపాగాయు నివియన్నియుఁగలసి మూఁడు రూపాయలకు మించవు. నిజమునకు విశ్వవిద్యాలయ విద్యార్థి యెవ్వఁడు నింతటి నిరాడంబరతను బాటింపలేఁడు సరికదా యూహింపనైన లేఁడు. అబ్బా! అర్థమున కింటింటికిఁ దిరిపెమెత్తు విద్యార్థియు, వ్యర్థాడంబరమున మిన్నుముట్టుటలో నైశ్వర్యవంతున కేమాత్రము దీసిపోవఁడు. తనకుఁ జేయూఁత నొసంగిన

దాతయెడ నణుమాత్రమైన కృతజ్ఞత చూపఁడు గదా యతని జీవితమున నీ పట్టభద్రుఁడు! అక్కడ గడచిన పిమ్మట నంతయు స్వప్రయోజకత్వమేయనును. కృతఘ్నత యింతకన్న నుండునా? కాని తీర్థరాముఁడు నిరంతరము బరిశ్రమించుచుఁ దన తెలివి తేటలకుఁ బ్రుల్లిపడక, తన యిక్కట్టులకు వెక్కసపడక, తన కష్టసహనశక్తికి గర్వింపక తోడ్పడినవారియెడఁ గృతజ్ఞుఁడై పరమేశ్వరునికృపకుఁ బ్రాంజలియై కాలక్షేపముగావించుచుండెను.

అతఁడు తన యర్థరాత్రి దీపతైలమునకై యాహారమును మ్రానుకొనును. దినములకొలఁది నిరాహారిగ నుండినను బాధా విచారము లాతని ముఖమునఁ జిహ్నితములుగావు. ఐనను కళాశాల కనుదిన మేగుచునే యుండెను. పాఠముల నవగాహన మొనర్చుకొనుచునేయుండెను. కొంతకాలమిట్లు గడవగా నతని యారోగ్యము పూర్తిగాఁ జెడెను. వ్యాధిపీడితుఁడై కొన్నాళ్లుండి యొక యుత్తరమున నిట్లు వ్రాసెను. "మనోనైశ్చల్యము, అమృతానుభవము ఈ దినములలో నత్యుత్కటముగ నుండును. భగవంతునియందు విశ్వాస మత్యాశ్చర్యకరముగ నతి నిబిడ మగును. శరీరము చంచలము నశాశ్వతము నగుటఁ జేసి దేహము నా ప్రతినిధిగఁ దెలుపుకొఁజాలను. వ్యాధిపీడలోఁ జిత్తైకాగ్రత, అంతఃప్రశాంతి అత్యంత సమచ్ఛస్థితియం దుండును. శారీరక బాధలకు స్వాగత మీయఁజాలని వారెంత భీరువులు!"

ఈ జాబతనికిఁగల బాధాతృణీకరణమునకు నిదర్శనము.

అప్పుడు తీర్థరామునిజూడఁ దటస్థించిన యొక యదృష్ట వంతుఁ డీక్రిందివిధమున నతని రూప రేఖావిలాసముల నభి

వర్ణించెను. "అతని సుందర ముఖారవింద మాధుర్యాభిజాత్యము నకు దర్పణము. భావ్యున్నతిని నాత్మరాగమును సూచించు నతని కనుబొమలు విండ్లవలె గుండ్రముగ వంగి నీలికనుల సోయ గము నతిశయింపఁ జేయుచుండెను. అతని ఫాలతల మత్యున్న తము నతివిశాలమునై యద్భుత మేధాశక్తి సూచకమై యుండెను. అతని పెదవులు స్త్రీసహజ మార్దవ సమన్వితములు. కార్యవ్యగ్రత యందు సంకల్ప దార్ఢ్యమును దెలుపుటకో యన నాడుగఱచి చిన్నగడ్డము చిన్నెలఁ జూపుచుండును. అతని జూచిన వారతని యసాధారణ పవిత్రత, యమాయక జీవనము, నమృతస్వభావముచే ముగ్ధులయ్యెదరు. అతఁడు ముగ్ధబాలవోలె బిడియమందును. అనురాగ మహిత తేజస్వియై జీవించు కత మున నతని శరీరకాంతి యాతని యాంతరంగిక స్వచ్ఛతకు సూచకమై యుండెను. అతనికి వినమ్రతకుఁదోడు పవిత్రములగు స్వాతంత్ర్యాశయములును గలవు. అశ్రుపూర్ణ లోచనములతో శిష్యసహజ భక్తిభావముతో ముగ్ధాంగనా సహజమానముతో విజేతృమనోబలముతో నామధుర విద్యార్థిమూర్తి విజ్ఞానేశ్వ రాలయమున జోడుచందానఁ బరిశ్రమించుచుండెను."

రాముఁడు ధన్నరాముని వియోగము సహింపఁజాలక పరితపించుచుండెను. అతఁడనుదినము గురుమహారాజుపేర నొకటియో రెండో లేఖలు వ్రాయుచునే యుండెను. ధన్న రాముఁడన్న వృద్ధుఁడు. ఆధ్యాత్మిక తత్వ బల సంపన్నుఁ డయ్యును మానవ సహజ భావావేశ పూరితుఁడు. రాముని హృదయము నతఁడనేక రీతులఁ బరీక్షింపఁ దొడఁగెను. అతఁడు బ్రహ్మచారి, ఇతరవ్యక్తు లెవ్వరతనికిఁ దోడ్పడువారులేరు. నాలు

గేండ్లపాటు తన రక్షకత్వమున రాముఁడున్న హేతువున రాముఁ డతనికి యావజ్జీవము జీవనమునిమిత్త మేదియో పంపుచుండెను. ఐనను బాలరామునకున్న భక్తిపారమ్యమునకుఁ దగినవిధమునఁ దృప్తికరమగు సమాధానమీయక ధన్నరాముఁడు జాగు సేయుచు నతనికి విచార మొదవించు చుండెను. రాముఁ డెప్పుడును తనదోషములనే పరిగణించు చుండెను. అందుచే గురుని తూష్ణీభావమునకుఁ దనయందేవో లేనిదోషము లారోపించు కొని క్షమను వేడుచు నతనికి నుత్తరములు వ్రాయుచుండెను. అందొకటి —

"అనుమతించిన, గెంటిన, నన్యమెఱుఁగ
భవదుదార గృహద్వార పథముదక్క;
ఎఱుఁగుదు మదీయశిరము, త్వచ్చరణ తలముఁ
దెలియుదును దాని కుచితంపుఁ దలమటంచు.

గురుమహారాజ! తావక కోపవహ్ని
నన్ను దహియింపఁజాల దెన్నండుగాని
యమృత శైతల్యము వహించి హాయిగూర్చు;
నీవొసఁగు విషమ్మగు నాకు జీవదాయి."

పరేంగిత జ్ఞానశూన్యుఁ డెట్టి పండితుఁడుగాఁడో పశు పక్షి మృగకీటకాదుల భాష యెఱుఁగనివాఁడు నట్లే బ్రహ్మ జ్ఞాని కాఁడు. సార్వభౌమచక్రవర్తి యిట్టి ప్రభావము గలవాఁడని విందుము. ఇట్టిశక్తి విక్రమాదిత్యునకునుఁ గలదని యతని కథ లొండు రెండు చెప్పుచున్నవి. తీర్థరామున కీశక్తి యనేయము.

ఒకనాఁ డాతఁ డుత్తరము వ్రాయుటకు బల్లకడఁ గూరు చుండెను. ఆ బల్లపై నొండు రెండు శర్కరాకణములు గలవు.

వానికిమిత్తమువచ్చిన చీమలఁగొన్నింటిని తీర్థరాముఁడుచూచెనో లేదో తత్క్షణమ యతని హృదయము వాని చర్యలఁ బరీక్షింపఁ దీవ్ర దీక్షగొనెను. ఆ దీక్షలో దేవుఁ డెంతటి ప్రేమమయుఁడో యెంతటి లీలాప్రియుఁడో కనుఁగొని యాలేఖలో నిటు లుల్లేఖించెను: "ఆ చీమలు నాయక్షరముల గమనించినవి. నిజమునకు నా యక్షరములలో రమ్యత కొఱవడి యుండినను నాపిపీలికములకవి యపూర్వసౌందర్యశోభితములు; చీనాచిత్రములట్లు విస్మయజనకములు: మంచిది. ఆ చీమలలోఁ గడుంగడుఁ బిన్న దిట్లు మిగిలిన చీమలతోఁ జెప్పసాగెను: 'అక్కలారా, గమనింపుఁ డాకలము కళాకౌశలము. అది చక్కని యక్కరముల నాణి ముత్తెములు వోనివాని నల్లే చెక్కుచుఁ జెక్కుచుఁ గడు సున్నితముగాఁ బర్వు లెత్తుచున్నది. అదియొక పరుగు పూర్తిచేసి తటాలున నా కాగితమున నంతకుముందు బర్వెత్తిన పథమునకు సరిగా దిగువఁ బరుగు ప్రారంభించును. ఇట్లు కొన్ని పరువులు పూర్తియైన పిమ్మట నది చిత్రించిన యక్కరము లన్నియుఁ గలిసి యొక జాబగుచున్నది. ఈ జాబును మానవు లతిప్రీతితోఁ దమ కనులకు సమీపముగాఁ దెచ్చికొని పఠించి పరమానంద మందుదురు. ఏమి యీ లేఖినీశక్తి! దీని ప్రభావమునకుఁ బ్రభువులు దోయిళ్ళులొగ్గి ధనరాసులు గ్రుమ్మరింతురఁట! ఇది సృజించు వర్ణములలోఁ గొన్ని కేవలము మనలను బోలియున్నవి. కొన్ని మన బంధువులగు సూక్ష్మజీవులఁ బోలియున్నవి.' దీని యుపన్యాసము ముగింపునకు వచ్చునప్పటికి మఱొక చీమ యంతకెంతెఁ గొలఁదిగఁ బెద్దది; 'కాదు - కాదు - గమనింపుఁ డాకలము నిర్జీవమైనది; దానిలో నేమికలదు! దానిని వ్రేళ్లతోఁబట్టికొనియున్న దే

యూచేయి, యూచేయియే దీని స్వైరవిహారమునకు హేతువు. కావునఁ గొనియాడఁదగిన దదిగాని యిదికాదు' అనివాకొనినది. ఇంతలో వానితల్లి చీమ, 'మీయిర్వుర వాదములును సరియైనవి కావు. ఆచేతి కాధారమైనది యదే కనుఁడు. ఆ మొండెమే యీపని కంతటికిఁ గారణము. అదియే ప్రశంసకుఁ బాత్రము." అని ప్రబోధించెను. ఇదియంతయు గమనించుచున్న నేనా చీమల నుద్దేశించి, 'నా యితరరూపములారా, ఆ మొండెము కొనియాడఁదగినది కాదు. అదియుఁ బ్రాణరహితమైనదే. దానికిఁ జైతన్యమిచ్చి మీ ప్రశంసకుఁ బాత్రముగఁ జేసినది యాత్మ. అదియేసుఁడీ వా స్తవముగ స్తుతిభాజనము' అని చెప్పితిని.''

నిజమున కితరజీవుల భాషలు నేర్చుట యనునది భౌతిక దృష్టిలో లేనేలేదనియే చెప్పవచ్చును. 'ఆత్మవత్సర్వభూతాని' యను సూత్రమును ప్రత్యక్షానుభవమునఁ జేఁబట్టుటే సకల జీవ రాసుల సంభాషణ లాలించుట.

'శ్రమలు లేక ఫలంబులు జగతి లేవు.'

శ్రమ జీవితశాసనము; జీవిత పరమాశయము. జీవిత పరీక్షల యందు తీర్ణులై విజయ విరాజితులు కాఁగలవారు స్వల్ప సంఖ్యాకులు. దుర్బలుల కేవి మార్గ నిరోధకములో అవియే సమర్థులగువారికి జీవితాభ్యున్నతి సాధ సోపాన పంక్తులు. అట్టి వారికి శ్రమలు పరుగిడుచున్న జలదములు. వాని ఋతువున నాపయోదములు వచ్చి యవియున్న పరిదేశమున వర్షించి తరువాత సదృశ్యములైన ఆకాశము యథావిధమున శుభ్రముగ నుండును. జీవితమిట్టి కష్ట జలదముల వృష్టిచేఁ జరితార్థమగును.

శ్రీరామునకు గిరులుగాని కష్టములు సంభవించెను. కష్టగిరులను తన కభీష్టములను నానంద సంధాయకములను నగు హిమవత్పర్వతసాను శృంగములుగ మార్చెను.

రాముని విద్యార్థిదశ శ్రమాస్పదమైనను మధురమైనది. అతని సహాధ్యాయి మిత్రులయందు వనస్పతిజీ యొకఁడు. అతఁడు 1907 లో రాముని విద్యార్థిజీవితము నభివర్ణించుచు నొక వ్యాసము నొక యురుదూపత్రికకు వ్రాసెను. వనస్పతిజీయును నతఁడును నొకగదియందే యుండి కలిసి విద్యాపరిశ్రమము గావించుచుండిరి. ఆహార విహార పఠనములందును నొకరినొకరు విడువనొల్లని గాఢ స్నేహబంధమున నుండిరి. రాముఁ డాత్మీయ రహస్యము లెట్టివైన నతనికిఁ దెలుపును. తన స్నేహితులందు రాముఁడెంతటి సరళస్వభావుఁడో యతఁడు తెలిపెను.

ఒకనాఁడు వనస్పతిజీయే కావచ్చును – రాముని సహవాసి – ఆడుచుఁ బాడుచుఁ గొంతకాల మానందమునఁ గడుపుచుండెను. ఒక పెద్దమనుష్యుఁ డతనిగాంచి, "దినమున కెన్ని గంటలు పఠింతువు?" అని యతనిఁ బ్రశ్నించెను. అందులకతఁడు నవ్వుచు, "దినమునకుఁ బదునెనిమిది గంటలు" అని సమాధానించెను. "ఇపుడు నాయెదుటనే నాలుఁగైదుగంటలు గడపితివి. భోజన నిద్రలకుఁ గనీసము ఎనిమిదిగంటలైనను దీసికొందువు. మిగిలినవి పండ్రెండుగంటలు మాత్రము. నీవెట్లు దినమునకు పదునెనిమిది గంటలు పఠింపఁగలవు? అవిశ్వసనీయము నీ పలికినది", యని యతని నాపెద్దమనుష్యుఁడు గేలిసేసెను. అంతట నావిద్యార్థి, "మీకు గణిత శాస్త్రము దెలియదా యేమి?

నేనును రాముఁడును గలిసి పఠింతుముగదా! నేను పండ్రెండు గంటలు పఠింతును. అతఁడిరువది నాలుగు గంటలు పఠించును. సగటున నేను పదునెనిమిదియు నతఁడు పదునెనిమిదియు గంటలు పఠింతుము." అనెను. ఆ పెద్దమనుష్యుఁడు, "ఇది మఱియు విచిత్రము. మఱియు నవిశ్వసనీయము. నీవొకవేళఁ బండ్రెండు గంటలు పఠింతువేమో! రాముఁడెట్లు దినము నందున్న గంటలన్నియు విద్యాపరిశ్రమకు వినియోగింపఁ గలఁడు?'' అని ప్రశ్నించెను. "అటులు దారికిరండు చెప్పెదను; వినుఁడు. రాముఁ డసాధారణ విద్యార్థి! ' ఆవిషయము లోక మెఱిఁగినదే; అతఁడు భోజన సమయమునఁగాని విహార సమ యమునఁగాని మఱియే సమయమునఁగాని విద్యాపరిశ్రమము గావించుచునే యుండును. గణితసమస్యనో లేక యేవ్యాసాం శమునో మఱియే కవితావస్తువునో గ్రహించి యాసమయమున దానిపై మనస్సును కేంద్రీకరించి యందు నిమగ్నుఁడై యుండియే యుండును. మనస్సు మనస్సు పనిని నిర్వహించుచుండ, దేహము దైహిక కార్యముల నిర్వర్తించు చుండును. అతఁడు నిద్రలో నైతము పద్యము లల్లును!" అని యతఁ డుగ్గడించెను.

రాముఁడు నడచునపుడును బఠించుచునే యుండును. ఒకనాఁడొకఁడతనిని "ఇది నీకళాశాలకాదు; వీధి." అనెను. 'ఔను రాముఁడు విశ్వవిద్యాలయ విద్యార్థి' యని యతని జవాబు.

నిజమే! రాముఁడు విశ్వవిద్యాలయ విద్యార్థియే. అతనికి విశ్వమే యొక విద్యాలయము. ప్రకృతియే యతని పాఠ్యపుస్తకము. ప్రకృత్యానందానుభూతులే యతఁడు నేర్చు పాఠములు.

అతఁడా పాఠములు పైపైఁ జదివి యవలఁద్రోయుటకాదు. వాని లోని సత్యమును దైవత్త్వమును దర్శించుదనుక తృప్తిపడయఁడు. అందుననేగదా యతఁడు లోకమునువీడి ప్రకృతిమహత్త్వమునకు నిలయమై మహిమాలయమనఁదగిన హిమాలయశృంగ మధిరోహింప నువ్విళులూరుచున్నది.

అతఁడొక లేఖలో దనకు వర్షమునఁబొడమిన భావముల నిట్లు వ్యక్తీకరించెను. "నిన్న మా కఖండవృష్టి. కళాశాలనుండి ఇంటికిఁబోవుచుఁ బ్రకృత్యానందమునఁ దేలిపోవుచున్నాను. పరిసరమంతయు జలమయముగా నున్నది. ఎటు జూచినను హరితశాద్వలములే గోచరించుచున్నవి. ఇంకొక విచిత్రము! ఆకసమును మబ్బులు పెల్లుగ నావరించి యొకప్పుడు భానుబింబమును గప్పివేయుచు నొకప్పుడు విప్పివేయుచు వినోదించుచున్నవి. తూములలోను కాల్వలలోను జలము ధారాళముగఁ బ్రవహించుచున్నది. వృక్షములు పుష్పముల విరజిమ్ముచున్నవి. పండ్లచెట్లకొమ్మలు ఫలభారవినమ్రములై, తమ రుచ్యఫలములఁ బైకిఁ గానరానీయ కుండుటకోయన భూమిని దాఁకుచున్నవి. పావురములు, నెమిళ్లు గాలిలో నానందమున విహరించుచున్నవి. తరుశాఖాగ్రములఁ గొన్ని పక్షివిశేషములు గానము లొనర్చుచున్నవి. కాదుకాదు; తమ యవ్యక్తానందమునకు గానరూపమున జీవముపోయుచున్నవి. వివిధములైన పుష్పజాతులు కనులువిప్పి నాకొఱకెదురుచూచుచున్నవా యనునట్లున్నవి. ఇఁక పచ్చసి గడ్డిమైదానములు నాకొఱకు నడయాడుట కుద్దేశింపఁబడిన పట్టుతివాచీలే. చీకటిమ్రాకులు దేవదారు తరువులు నివియన్నియు స్నానానంతరము ఒంటికాలిపై నిలిచి ధ్యానము సేయుచున్నవో యనునట్లుండెను.

పైచి, గదివెలుపలికి గంతువైచెను. నేఁడింతటి ధైర్యముగఁ దోఁచిన యీ బాలుఁడు భావిజీవితమున భయభ్రాంతుల సంపూర్ణముగ జయించుట మనము గనఁగలము. మఱియొకనాఁడు కొందఱు చోరులు ఆ గదితాళమును బగులఁగొట్టి యతని చిన్నపెట్టెలో నున్న కొలఁది పైకమును చిన్న చిన్న దుస్తులను వస్తువులను నపహరించి చనిరి. రాముఁడానాఁడు గృహమునఁ బ్రవేశించి యీస్థితి గోచరించుటతోడనే తన పుస్తకములవైపు దృష్టిని బ్రసరించినాఁడు. పుస్తకము లపహృతములు కాలేదు. అతని మనస్సు నిశ్చలముగ నుండెను. "అన్నలారా! నా పుస్తకములు విడిచి నన్ను మన్నించినందులకుఁ గృతజ్ఞుఁడను" అని పలికెను.

ఈపరిస్థితులన్నియుఁ గళాశాలా విద్యార్థులలోఁ గలవరము పుట్టించెను. ప్రధానాచార్యుఁడు తెలిసికొని రాముఁడు తప్పక కళాశాలవారి భోజనశాలలోఁ బ్రవేశింపవలయునని యాజ్ఞాపించెను. మనస్కేంద్రీకరణమునకు ఏకాంతవాస మవసరమని రాముఁడు ప్రత్యుత్తరమిచ్చెను. కాని యీతనేర్చుకోఁ దలఁచినవాఁడు నీటిలోనుండుట యెట్లు తప్పదో యట్లే విద్యాభ్యాస మొనర్పఁదలఁచినవాఁడు ప్రపంచకమునఁ గలిసిమెలసి సంచరించుచుఁ జిత్తము నేకాగ్ర మొనర్పవలయును. కళాశాలా భోజనశాలలోఁ జదివినవారెందఱో యంతకుఁ బూర్వము పరీక్షాకృతకృత్యులలోఁ బ్రథమగణ్యులైరి. గృహమునకుఁ బ్రత్యేకముగ నద్దె చెల్లింపఁబనిలేదు. ఈ కారణములన్నియు గ్రహించి యన్న రామునకు నివేదించి యనుమతిఁబడసి తాత్కాలికముగ హాస్టలులోఁ బ్రవేశించెను.

సాధారణముగఁ బుస్తకములకొఱకుఁ బస్తుండు నతఁడు భోగవస్తువు లపేక్షింపఁడని వేఱ నుడువఁ బనిలేదుగదా! రాము నకుఁ బండుకొనుటకు మంచముగాదు; నేలయే. అతఁడు గొలఁదిగ నిద్రించును. ఒక నిమిషమునైనను వ్యర్థముగావింపఁడు. ఈవిష యమున కతఁడు తన గురుమహారాజునకు వ్రాసిన యొక లేఖ యిదిగో:—

ఆచార్య మహాప్రభూ,

నేఁడు తమజాబు చేరినది. అత్యంత హర్షాబ్ధిఁ దేలినాఁడను. ప్రతి దినమును నేనుదయ మైదు గంటలకు మేల్కాంచి యేడుగంటలుదనుక చదువుకొందును. పిమ్మట వ్యాయామ మొనర్చి స్నానము గావింతును. అప్పుడు నాయుపా ధ్యాయునియొద్దకు దారియందుసైతము చదువుచునే వెళ్లెదను. అచట సుమారొక గంటసేపు చదివి, భోజన మొనర్చి, యాయన బండిలోనే కళాశాలకుఁ బోయెదను. కళాశాలనుండి తిరిగివచ్చుట తోడనే కొలఁదిగఁ బాలుద్రావెదను. ఒకింతసేపు శ్రమాపన యము గావించుకొని షికారున కేగెదను. పచ్చపైరు భూము లపైఁ ద్రిమ్మరి యింటికిఁదిరిగివచ్చి పై యంతస్తులో నిటు నటు దిరుగుదును. నడచుచుఁ జదువుకొందును. చీఁకటి పడినంతనే వ్యాయామ మొనర్తును. దీపమును వెలిగించి 7 గంటలవఱకుఁ జదివికొని రొట్టెనుదిని ప్రేమజీ కడకేగెదను. తిరిగివచ్చుటతోడనే కొలఁదిగఁ బది పంద్రెండు నిముసముల కాలము వ్యాయామ మొనర్తును. నా యనుభవమునఁ గడుపు తేలికగ నున్నయెడల సుఖముగను సంతోషముగను నుండునని యు సులభముగ, మనో నిశ్చలత భగవంతునిపై భక్తి గుదురుననియు గ్రహించితిని. మనః

పరిశుభ్రత కతమునఁ దెలివితేటలు, జ్ఞాపకశక్తి నిశితములగును. కావున నల్పముగ భుజింతును. భుజించిన యల్పమును బాగుగ జీర్ణించుకొందును.

తమ సేవకుఁడు,

తీర్థరాముఁడు

రామతీర్థుఁడు తరుణ వయస్కుఁడుగ నుండఁగనే మృత్యుముఖ గహ్వరమునఁ బడుదునని మున్నుగ గుర్తించియే ప్రతిక్షణమును సక్రమోపయోగమునకుఁ దేఁ బ్రయత్నించె నేమో యని తోఁచెడిని. ఇట్టి విద్యాతృష్ణ సాధారణ విద్యార్థులయం దగోచరమ యగుట గుఱునవ కంపిన ఈక్రింది యుత్తరభాగము సూచింపఁగలదు.

'సెలవులయందు విద్యా పరిశ్రమము గావించు నవకాశము ననుగ్రహింప మిమ్ములను, దైవమును బ్రార్థించుచున్నాఁడను. చదువుకొను దినములు వ్యర్థములై చనుట యభిలషణీయముకాదు. నా శ్రమలు సరియైన పథమున నుండుట మిక్కిలి యవసరము. ఆ శ్రమలు భగవదనుగ్రహమున విజయదాయకములు గాఁగలవు. నన్ను నేను మిక్కిలి యయోగ్యునిగఁ దలఁతును. ఏకైక పరమాశయము-నాకిష్టమైన చదువు - అధికతరమగుట - నాకితర వాంఛలు లేవు. మీయెడ నాప్రేమయు దినదిన ప్రవర్ధమానముగాఁ గోరుచున్నాను. అదియే నాపను లన్నిఁటికి మూలాధారము. ఏదో యొకవిధమైన చదువు లేకుండ నా కాలమును వ్యర్థము చేసికొనకుఁడు. ఇదియే నాసంప్రార్థనము.'

కార్లైలువలెనే యీతఁడును నిరంతర కృషియే జయకీలకమను సిద్ధాంతమునకుఁ బ్రాధాన్య మిచ్చును. అందులోనే జీవిత మోక్షముగలదు.

ఘనత కవిచ్ఛిన్న కృషియే కారణము; ఈయాథార్థ్య నిరూపణమే రామతీర్థుని జీవితము. కేవలము కృషి యున్నతా దర్శమువినా వ్యర్థమే. అట్టి పరమలక్ష్య మతనికి గలదనుట యతని యుత్తరములందు గోచరించును. సెలవులలో లాహో రును పీడిరమ్మను నొక జాబున కతఁడు వ్రాసిన ప్రత్యుత్తరము:

'నిరంతర పరిశ్రమలేక యెవఁడును జ్ఞాన సముపార్జ నమునఁ గృతార్థుఁడు గాఁజాలఁడు. నేఁడు విద్యావంతుఁడుగఁ బరిగణింపఁ బడువాఁడు కేవలము తెలివితేటలవలననే యట్టి వాఁడైనటులు గన్పింపవచ్చును. అతఁడు పడిన శ్రమల విధా నము మనకుఁ దెలియక పోవచ్చును. అయిననేమి? అతఁడు రహస్యముగఁ బరిశ్రమించు చుండును. లేదా చిరంతనకృషి యంతకుఁబూర్వమే సలిపియుండును.

నిజమే, కొందఱు విద్యార్థులు సెలవులలో నిండ్లకుఁ జనియుఁ బాఠములయందుఁ గృషిసలుపుట. కాని దీనికిఁ గల కారణము వేఱు. వారి యిండ్లయొద్దఁ గానిండు; మఱెచ్చోట నైనను గానిండు; విద్యాభంగకరము లెవ్వియు వారికి లేక యుండును. వా రవివాహితులై యుండవచ్చును. లేదా నిగ్ర హము కలవారైనఁ గావచ్చును. కాని నామనస్సు ఇంకను నట్టి స్థితికి రాలేదు. మనోబలము సైతము శ్రమఫలమే.

ఇఁక రెండు సంవత్సరములు మాత్రమే మిగిలియున్నవి. అధికకాలము లేదు. ఇపుడు శ్రమింపనియెడల నాజీవితమున శ్రమించు నవకాశమేడ? నాకుమామఁడు ఇంగ్లండు కేగెననియు నచటువాసి తిరిగివచ్చిన తరువాత నన్ను విడిచి యుండఁడనియుఁ

దలపోయుము. యుద్ధసమయమున రాజపుత్రుఁడు సైన్యశిక్షణ మునఁ గాలము వినియోగించుటకు ననుమతింపఁబడు నటులనే నేనును విద్యాకృషియందు నిమగ్నుఁడనైయుండ ననుమతింపఁ బడితినని తలఁచి తదితర పారితోషికము లెవ్వియుఁ జూపకుఁడు. కావున దయయుంచి యీవిషయమై యేమాత్రము వివాదము సలుపకుఁడు. నేను మీయాజ్ఞకు బద్ధుఁడనగు సేవకుఁడను.

పరిశ్రమయే నాకత్యంత గౌరవాస్పదమగు నత్యంతావశ్యక వస్తువు; అయినను నామనస్సు సులభతరముగ విద్యయందు లగ్నమగుటకు మీయాశీర్వాదము నా కవసరమే. దయయుంచి యిది యనుగ్రహింపుఁడు. ఓప్రభూ! నామనస్సు చదువునందే విలీనము గానిమ్ము. గాఢపరిశ్రమయందు త్రికరణశుద్ధి నాకు గలుగనిమ్ము. నాయాశల ఫలింపఁజేయ నీవొక్కరుఁడవే శక్తుఁడవు.'

అతఁడు నిరంతర మభిలషించినది శ్రమించుటకు శక్తి. అందుల కాతఁడు సలిపినది ప్రార్థనము.

విద్యాతృష్ణగల యీవిద్యార్థి కళాశాలయందుఁ జూపిన యభివృద్ధి యెట్టిదో యూహించుట సులభము. పారశీక తరగతియందు రత్నమై ప్రకాశించెను. కాని బ్రాహ్మణకుమారుఁడైన యతనికి సంస్కృత విద్యాభ్యాస మణుమాత్రము లేకుండెను. స్నేహితులు కొందఱతనికి దైవి యజ్ఞాతమగుటనుగూర్చి యధిక్షేపించిరి. మౌల్వీ ప్రజ్ఞావంతుఁడును శ్రద్ధాళువునైన తనవిద్యార్థి పెఱతరగతిని ప్రాపించుటకుఁ ద్వరగా నంగీకరింప లేదు. రాముఁడు సంస్కృత మభ్యసించి యాభాషతోడనే యఫ్. ఏ పరీక్షకు సంసిద్ధమగుటకు దృఢ సంకల్పము గలవాఁడయ్యెను. అక్షరజ్ఞానమేనిలేని యతఁడా భాషలోఁ బరిపూర్ణ ప్రజ్ఞ స్వల్ప

కాలములో గడించుట యసంభవమని యందఱు తలంచిరి. కాని యతఁడా భాషలోఁ గృషిచేసి యఫ్. ఏ. పరీక్షకుఁ గూర్చుండ ననుమతిఁ బొందెను. తొలుదొల్త సంస్కృత పండితుఁడు భాషకు నంతకుమున్ను బరిచయములేని యతఁడు ఆ తరుణమున దానిని వశవర్తినిగాఁ జేసికొన నేరఁడని తలఁచెను. కాని రాముఁ డసాధారణ విద్యార్థి; తన బుద్ధి కుశలతచే సంస్కృత పాఠ్యగ్రంథముల నవగాహనము సేసికొని పండితు నత్యాశ్చర్య చకితు నొనర్చెను. సంస్కృత విద్యాభ్యాసమునఁ గాలము చాలభాగము వినియోగించి యఫ్. ఏ. పరీక్షయందు గొప్పగ సమ్మానితుఁ డయ్యెను.

అతఁడు విద్యార్థి వేతనములు (స్కాలర్షిప్పులు) సంపాదించియు, నితరుల సాయము పొందియుఁ దన విద్యార్థి జీవితము నంతయు నెటులో గడపువాఁడు. అతని మిత్రులతనికిఁ దోడ్పడ నాతురపడుచుందురు. లాహోరులో నొక భాగ్యవంతుఁడు తనపిల్లలకుఁ బాఠములు జెప్పించుకొని సాయపడుటచే స్వయంసహాయమతఁడు కొలఁదిగఁ జేసికొనఁ గల్గెను. ఈ క్రిందిజాబు స్పష్టపఱచు విధమునఁ బేరు చెప్పకొకుండ ననేకులు అతనికి బహూకృతుల గఁ బాఠశాలాధ్యక్షుని కిచ్చి యందఁజేయు చుండిరి.

ప్రియతమాచార్యా!

ఈనాఁడు ప్రిన్సిపాలుగారికి నాకిచ్చునిమిత్తము ఏఁబది రూప్యముల నెవరో యిచ్చిరఁట! వానినిగొమ్మని ప్రిన్సిపాలు గారు నన్నుఁగోరిరి. నాయందంతటి దయజూపు మహనీయుఁ డెవఁడోయని విచారించితిని గాని యతనిపేరు వారికిఁ దెలియ దనిరి. నేను వారే స్వయముగా నిచ్చినారని తలఁచితిని. నాకు

దానిలోఁ గొంతభాగమునిచ్చి శేషించినది కళాశాలకు విని యోగింపుఁడంటిని. అందులకు వారు సమ్మతింపలేదు. మాకు గణిత శాస్త్రాధ్యాపకులగు గిల్బర్ట్సన్‌గారు నాకళాశాల కర్చులలో సగము భరించుచున్నారు. ఇంకను నాయనను గష్ట పెట్టుట నాకిష్టములేదు. కావున నేను జెల్లింప మిగిలిన కళాశాల జీతమును దీనిలోఁ దీసికొండంటెని. అందులకుఁ బ్రిన్సిపాలుగారు ఆవిషయము గిల్బర్ట్సను గారికే వదలెదమనిరి. నేను ఆమొత్తమును అయోధ్య ప్రసాదునకు ఇచ్చినాఁడను. మీారిక్కఁడకు వత్తురేని చాల సంతోషము.

తమభృత్యుఁడు,

తీర్థ రాముఁడు.

తీర్థరాముని పవిత్రశీలము నీ జాబు ద్యోతకము చేయఁ గలదు. అర్హత గలవానికి ఆవిధమున బహూకృతులు వచ్చినవి యన నచ్చెఱువేమికలదు? మఱియొకమాఱు అధ్యాపకుఁడు పిలువనంపి మూసిన కవరు నొకదాని నిచ్చెను. పాఠములకుఁ బ్రారంభకాల మైనందున, త్వరగా తరగతి కేగుమని పంపెను. పాఠానంతరము కవరులోనిది పైకమని రాముఁడు గుర్తెఱిఁగెను. స్వయంసహాయ శీలురకు దైవసాహాయ్యము లభింపఁగలదని యొక యార్యోక్తి గలదు. దానికిఁ దార్కాణము రాముని జీవితము.

రాముని విద్యార్థిజీవితమునకు బ్రథమాఘాతము ప్రవేశ పరీక్షయం దుత్తీర్ణుఁడైన వెంటనే సంభవించెను. అతని జనకుఁడు కుమారుని పురోగమనమునకు నడ్డువచ్చెను. దానినెట్లో దైవ కృపవలనను దృఢ దీక్షవలనను అతఁడు తప్పించుకొనెను. ఇపుడు మఱొక యాఘాతము, తీవ్రతరము.

మన మిదివఱలో గమనించినతీరున నాతఁడు తెలివిగల విద్యార్థి; అతని నాచార్యులును ననురాగపాత్రునిగ గణించిరి. వా రాతఁడా సంవత్సరము పరీక్షయం దుత్తీర్ణులం దగ్రగణ్యుఁడై విద్యార్థి వేతన మనూనార్హతఁ బడయునని యూహించిరి. రాముఁడును విశ్వాసపూర్ణుఁడై యాశాలతను బ్రోదిచేసికొనెను. ప్రథమ పర్యాయము ముత్తీర్ణుఁడైన నింగ్లండునకుఁ బంపఁబడువాఁడు. అతఁడు బ్లూ రిబ్బనును సంపాదించి సీనియర్ రాంగ్లరు అయియుండువాఁడు. కాని భగవంతుఁడు అతనిని అధికతర ప్రయోజనకారియగు మఱొక కార్యమునకు నుద్దేశించెను. అందులకే యతఁడు తన యనుకంపకు నిదర్శనముగా నపజయమును బ్రసాదించెను. విచిత్ర వాయుప్రచారముచే – విశ్వవిద్యాలయములందు సహజమే – ఆ సంవత్సరము మేధానిధులనేకులు కృతార్థులుకాలేదు. ఎవరనుకొనని వారలు తీర్ణులైరి. అదృష్టమునకే విజయము సంభవించెను. రాముఁడు బాగుగా వ్రాయునని ప్రిన్సిపాలునకు చంచలవిశ్వాసము. అందుచే నాతని పరీక్షాపత్త్రములఁ దెప్పించి గుణవిమర్శము గావింపఁ దలపెట్టెను. కాని యూతని ప్రయత్న మెందునను సాఁగినదికాదు.

బహుశః కారణ మిదియైయుండును: పరీక్షాపత్త్రమునఁ బదమూఁడు సమస్య లిచ్చి యందే తొమ్మిదింటికేని చేయుఁడని పరీక్షకుఁ డొక గమనికను వ్రాసెను. గణిత శాస్త్రమున నందెవేసినచేయి యగుటచేఁ దీర్థరాముఁ డొసఁగిన సమస్యల నన్నింటిని జేసి పరీక్షకుఁడే తొమ్మిదింటికేని గుణగణనము జేయ వగునని సూచన గావించెను. పరీక్షకుఁ డెవఁడో ఈ నిరంకుశ వర్తన మతనికొక యంకుశప్రాయముగఁ దోఁచెఁ గాఁబోలు;

సహింపనేరక [illegible] నొక [illegible] విద్యార్థి [illegible].

[illegible] లభించెను. అప్పుడు [illegible]: "[illegible] రాముని కామిత [illegible]. [illegible] లభింపకున్న నేమాయె? [illegible] భారతీయునియందున్న నాకే యది లభ్యమైనది."

చూచితిరా! అద్వైత విజ్ఞాన మెంతటి విషాదకర ఘట్టము 'నెంత యానందకర ఘట్టముగ మార్చెనో! రాముని పరమ శేయస్సహి ష్ణుత విద్యార్థులకు – విద్యార్థులకననేల? – ఎల్లరకు మేలుబంతి.

బాల్యముననే సంసారభారవహనము, ఇరువది రూపా యల విద్యార్థి వేతనము నష్టమగుట, అందుచేఁ జదువు సాఁగింప నవకాశము లేకుండుట, ఇట్టి యిక్కట్టులఁ బాలయినం దున నతని కిదియొక యాశావిఫలత మాత్రమే కాక తీవ్రవేదన కాకరమయ్యెను.

నిజమున కాతఁడు జీవితమున నిమ్నోన్నతముల గణించు వాఁడు కాఁడు. కొంతకాలమున కతనిపేరు ప్రొవిన్షియల్ సివిలు సర్వీసునకుఁ బంపుటను ప్రిన్సిపాలు దెలుపఁగా, "నా కృషి మహా ఫలమును విక్రయింపఁ దలఁపెట్టలేదు. దాని మాధుర్యమును విశ్వమానవకోటి కందఁజేయుటే నాయాకాంక్ష" యని తెలిపెను.

ఈవిధమున విఫలమనోరథుఁడైనందున, భవిష్యత్తంతయు నయోమయ మయ్యెను. ఇఁకమీఁద నతఁ డేమిసేయఁగలఁడు? విద్యాభ్యసనము కొనసాఁగుట యెట్లు? దైవమే గతి యయ్యెను.

రాముఁడు పరీక్షయందు త్తీర్ణుఁడు కాలేదని వినినంతనే గుండె బ్రద్దలైపోవునేమో యనునంతటి భయంకరాఘాతమును బొందెను. కనుదోయి నశ్రుకణము లురలఁ జొచ్చెను. అతని తండ్రి సాయము జేయఁడు-భార్యతోఁ గాపురము. విద్యార్థి వేతన సాహాయ్యముండుటకతన నిదివఱకెట్టి తొందఱయు లేకుండెను. ఇపుడా సాయము నిరాకృతము గావున నతని భవిష్యత్తంతయు నంధకారబంధుర మయ్యెను. మనస్సునకుఁ బ్రశాంతతను గూర్పఁ గలిగినది భగవద్గుణకీర్తనమే. అశ్రుజలపూర్ణములగు నక్షులతో నాతఁ డిట్లు పలుకఁ జొచ్చెను.

"ప్రభూ! నీవే నాతల్లివి, తండ్రివి. నీవే నా హితుడవు, సోదరుఁడవు. నీవే నా విజ్ఞానధన సర్వస్వమవు.

రాముఁడు సంపూర్ణముగ నీవాఁడు. అతనికి నీ పావన నామజపమే కర్తవ్యము. నీయభిప్రాయమునకు వ్యతిరేకిని గాఁ జాలను. కష్టసమయమిది. రక్షింపుము. ఓ తండ్రీ! ఇదినీకుఁ గర్తవ్యము. రామునిశరీర మిఁక నతనిదికాదు. నీ వతనిని రక్షింపఁ దలపెట్టితివా? రక్షింపుము. లేదా? నీయిష్టము. నీ యిచ్ఛవచ్చిన తెఱఁగునఁ జేయుము."

అసహాయస్థితి యెల్లరకు వచ్చును. అది యెవఁడును దప్పించుకోఁ జాలఁడు. అప్పుడు దుఃఖించుటయు నసహజము కాదు. కాని కేవలము భగవదధీనముగ యావత్కర్తవ్యముంచి తాను నిమిత్తమాత్రుఁడై దైవమును శరణుఁజొచ్చుట యసాధారణమనక తప్పదు.

శిశువు దెబ్బతగిలినపుడు భయముచేఁ దల్లిచంక కెక్కి గాఢముగ నామెను కౌఁగిలించుకొని వీడనివిధముననే రాముఁడు

పరీక్షాకాలమున భగవంతునకు 'అన్యథా శరణమ్ నాస్తి త్వమేవ శరణమ్ మమ' యని మనస్ఫూర్తిగ శరణాగతుఁ డయ్యెను.

స్వప్నములలో నైనఁ దలపోయని యనేక కార్యములు నైనప్రార్థనచే నిర్వహింపఁ బడును. అతని యార్తనాదము గజరాజవరదుఁడు వినెను. అతని పితృవ్యుఁ డొకఁడు, 'నిమిత్తాసహాయి కాఁగలను; ద్రవ్యసహాయము నేఁ జేయుదు', నని యుత్తరము నొకదానిని సకాలమున వ్రాసెను

ఈ ద్రవ్యసాహాయ్యమున కాతఁడు కృతజ్ఞత దెలిపెను. అదియు రెండవ పర్యాయమైనను బరీక్షయందు ప్రప్రథముఁడుగ వచ్చుటమూలముననే. అందుపైమఱల విద్యార్థివేతన సాహాయ్యము సంపాదించి యథాప్రకారముగఁ జదువు కొనసాగించెను.

ఇప్పుడు తీర్థరాముఁడు బి. ఏ. పట్టభద్రుఁడు. విద్యాపారంగతుఁడు గావలయునని యతని యాకాంక్ష. తాను చదువుచున్న క్రైస్తవ కళాశాలలో బీ. ఏ. వఱకే గలదు. యం. ఏ పరీక్షకుఁ జదువునిమిత్తము లాహోరులోనే యున్న ప్రభుత్వ కళాశాలలోఁ బ్రవేశించెను. రామాగమనము ఆకళాశాలకు నూతన కాంతులఁ బ్రసరించెను.

గణితశాస్త్ర మభిమానవిషయము రామునకు; అందాతఁడు కష్టతర సమస్యల సృజించును; సులభతరసూత్రము లావిష్కరించును; బండ సమస్యలఁ బరిష్కరించును. పదునెనిమిది స్థానములవఱకుఁ గల గుణ్యగుణకముల గుణాకారము నొకే పంక్తిలోఁ జేయును. అతఁ డొకపరి దుష్టచతుష్టయముం బోలి నానా కష్టముల కాకరములయిన గణితశాస్త్రసమస్యల నాల్గింటిని బరిష్కరింపఁ గృతనిశ్చయుఁ డాయెను. అదియొక కఠోర

ఉగ్రవ్రతము, హఠయోగము. సామాన్యుల కీదీక్ష యొకింత ప్రమాదమునకు దారితీయునుగావున నిది యనుసరణీయము కాదు. కాని ప్రశంసనీయమనక తప్పదు. బలశాలి ప్రదర్శించు నద్భుత చర్యల మనము గొనియాడఁగలముగాని యతఁడొందిన శిక్షణమును బడయనిదే యట్టి యద్భుత ప్రదర్శనమునకు గడఁగుట ప్రమాదముగదా! ఎటులేని నేఁటి విద్యార్థులకు నీతీవ్ర దీక్షలో సహస్రాంశమున్నను కృతార్థులగుట నిస్సంశయము.

'సాగర తరణమో నా మరణమో' యని రామభద్రుఁడు వహించిన దీక్షను మఱపింపఁజాలు దీక్ష రామతీర్థుఁ డారేయి పూనెను. సూర్యోదయమునకు సమస్యలన్నియు సమగ్ర పరిష్కారమును బడయవలయును; లేదా, రాముని కంఠము ఛేదింపఁ బడవలయును. ఇటులాతఁడు ప్రతిజ్ఞా స్వీకారము గావించి ప్రయత్నింపఁ బ్రయత్నింపఁ దుద కర్ధరాత్ర సమయమునకు మూఁడుసమస్యలు వీడివచ్చెను. నాలుగవది యెంత శ్రమించినను లాభములేకపోయెను. రాముని మెదడు తీవ్రకృషి గావించుచుండెను. వెఱ్ఱివానియట్లు, బాహ్యప్రపంచ విస్మృతిలేని యోగియట్లు, చరింపఁదొడఁగెను. తల బ్రద్దలు కొట్టుకొన్నను తేలలేదాసమస్య. తెల తెల వాఱుచుండెను. సూర్యోదయ మప్పుడయ్యెనో యేమో సూర్యుని యపరంజి కిరణములు రాముని గదిలోనికి గవాక్షపు సందులలోఁగుండఁ బ్రసరించుచుండెను. అవి యొకింత గన్పట్టెనో లేదో రాముఁడు త్రుళ్ళిపడి లేచి తనప్రక్కలో దాఁచియుంచిన కరవాలమును పైకిఁదీసి కంఠమును గుఱిచేసి యెత్తనారంభించెను. ఆఖరకరాసి కంఠమును కరకర గోయనుండెను. ఒండు రెండు నెత్తురు

బొట్టులు భూదేవి కల్పితములయ్యెను. ఆసూర్య కిరణకాంతిలో నతనికి దివ్యాక్షరములు స్పష్టముగ గోచరించెను. ఏమా యక్షరములు? అతఁడు పరిష్కరింపఁ జాలకున్న సమస్యకు సరియైన సమాధానము. వెంటనే యాలెక్కను పుస్తకముపై నెక్కించెను. పిమ్మట నాసమస్యా పరిష్కారమును రాముని ముఖమున విని యది తేలక తన్నుకొనుచున్న ప్రభుత్వకళాశాలోపన్యాసకుఁడు, ఆచార్య ముఖర్జీ యత్యాశ్చర్యమగ్నుఁడై రాముననేకవిధముల నభినందించెను. ఇట్లే యాతఁడనేక పర్యాయములు దీక్షాపూర్వకముగ గాఢపరిశ్రమ గావించి గణితశాస్త్రజ్ఞానమును గడించెను.

అతఁ డిట్టిపరిశ్రమ గావించుచున్నను నాహారాది విషయముల శ్రద్ధ వహింపఁజాలకుండుటకు ముఖ్యకారణ మతని దారిద్ర్యమే. అందుచే నచిరకాలముననే యతనికి నేత్ర వ్యాధి సంభవించెను. అతఁడు కళాశాలా వైద్యునితో సంప్రదింప నాతఁడు లోచనములఁ బరీక్షించి సులోచనము లుపయోగింపుమని సలహాయిచ్చెను. వానిని బొంబాయినుండి యైదు రూప్యములకుఁ దెప్పించుకొని తనకంటికిఁ దగినవని వైద్యునిచే నుల్లాకునుబడసి పిమ్మట వానిని ధరించెను. నేఁడు బాల బాలికలు ఫ్యాషనుకొఱకని కనులకు జోడుతగిలింతురు. తుదకు వీనిని భోజనసమయముననను విడఁజాలక వీనికి తోఁబుట్టువుల నేత్ర వ్యాధులను గొని తెచ్చి కొందురు.

రాముని విద్యాపరిశ్రమము, అఖండదీక్ష, అమోఘ ప్రతిభ లాహోరు నగరమునఁగల విద్యావంతు లెల్లరదృష్టి నాకర్షించెను. అతని సహాధ్యాయిబృంద మనుదినము నతని

ప్రజను ప్రత్యక్షముగాఁజూచి వేనోళ్ళఁ గొనియాడు చుండెను. కొందఱు విద్యార్థు లతనితోఁ గలిసి చదివి యధిక విద్యావిజ్ఞాన లాభము బొందఁజూచు చుండిరి. కొందఱు విద్యార్థు లతనితోఁ బరిశ్రమించుచు నతని సుగుణసంపత్తి కచ్చెరువందుచు నతని ననుకరించి కృతార్థులగుచుండిరి. అతఁడు దయాపూర్ణుఁడై యట్టివారికిఁ దోడ్పడుటయే యొక భాగ్యమని తలఁచి వారికిఁ దోడ్పడుటలోఁ దనకాలమును బోఁగొట్టుకొను చుండెను. కాని యతనికి విద్య యొకతఱుఁగని నిక్షేపము. 'చెలమ తీయుకొలఁది జలమెట్లూరుచుండునో యట్లే విద్యార్థి తనవిద్యానుభవము పంచినకొలఁది నది పెరుగుచునే యుండును. అన్యోన్యానుభవముల నొండొరుల కందించుకొనుచుఁ దమ విద్యను బెంచు విద్యార్థులు యథార్థముగ ధన్యులు. విద్యార్జనము సేయు విధానములలో విద్యాబోధన మొకటి', యను విశ్వాసమతనికి పూర్ణముగఁ గలదనుట కతని నడవడి ప్రబల నిదర్శనము.

దాదాభాయి నౌరోజీ తీర్థరాముని విద్యార్థి జీవితపు టంత్యదినములలో నొకనాఁడు (1893 డిసెంబరు 26) లాహోరునకు వచ్చెను. అప్పుడతఁడు బ్రిటిషు పార్లమెంటులో సభ్యుఁడు; నేషనల్ కాంగ్రెసు అభివృద్ధికి మూలబీజములు జల్లుటలో నద్వితీయకృషి కర్త. ఈమహానాయకుని రాకను నిరీక్షించుచుఁ బ్రజ లపారపారావారముగ రైల్వేస్టేషనుకడఁ జేరియుండిరి. అతఁడు మధ్యాహ్నము బండికి దిగెను. ప్రజల యుత్సాహమునకు మేరయే లేదు. అతని కఖండ స్వాగత మీయఁబడెను. అతఁ డేయింద్రుఁడో యుపేంద్రుఁడో యన్నట్లతనికి బ్రహ్మాండమగు నూరేగింపులు జరుపఁబడినవి. ఈదృశ్యమునకు తీర్థరాముని

హృదయవారాశి నొక చిఱుత యలనేని పైకిఁ బంపలేదు. అతని జ్ఞానపిపాస నీ యూషరంబరము దీర్పఁజాలదుగదా! నాఁటి మహాసభలో కాంగ్రెసువారి లెందఱో హేమాహేమీలు గంభీరోపన్యాసము లొనర్చిరి. అవి యేవియు నీమధుర విద్యార్థి మూర్తి హృదయమును చిగురింపఁ జేయలేదు. అతఁడు వాంఛించు ప్రియతమవస్తు వందెచ్చటను గన్పింపలేదు. అవి యన్నియు భౌతిక వస్తు విషయికములే. అతని కీవిషయములు రుచిఁగల్పింప కుండుటకుఁ గారణ మతఁ డూహించెనో లేదో కాని యతఁ డత్యంత గాఢముగ విద్యారంగము నట్లు రాజకీయ రంగమును బ్రేమింపకుండుటయే యని మన మూహింపఁగలము. ఆత్మ సమస్యముందు దేశసమస్య యతనిదృష్టిలో నల్పముగఁ దోఁచెనో! ఏమైనను విద్యారంగ ముత్తమపౌరులఁ దయారొనర్ప నేఁడట్లు నాఁడు విద్యా విధానమున యత్న మున్నట్లు తోఁపదు. ఉన్నయెడల తీర్థరామునివంటి యాదర్శ విద్యార్థికి రాజకీయ ప్రబోధము కలుగకపోవుట యాశ్చర్యకరముగాదా! ఇటీవల పాఠశాలలలో లేకున్నను దేశమునందలి జాతీయోద్యమ విజృంభణమున విద్యార్థులదృష్టి రాజకీయరంగముపైఁ బ్రసరించినది. మహనీయులగు నాయకుల త్యాగశక్తి వారిని రాజకీయ వాతావరణమున ముంచితేల్చినది. అయినను సుశిక్షితులైన యోధులుగారు గావున నీవిద్యార్థులు తమ కర్తవ్యమును విస్మరించి వెఱ్ఱిపరుగులెత్తి వెలువు గానకున్నారు. వీరు తమతాహతు నెఱుఁగక, మహానాయకులే దిద్దలేని రాజకీయ సమస్యలను మేము మేమని దిద్దఁబూని తమ యమూల్యకాలమును వ్యర్థము గావించుకొనుచున్నారు. విద్యార్థు లప్రమత్తులై సర్వము దెలిసి

కొనసాగుచు తనవిజ్ఞానము నభివృద్ధి గావించుకొనుచు సమస్యా పరిష్కారము తమదిగాదని పెద్దలకువిడి తమకురాఁగల తరుణమునకు వేచియుండవలయును. కొద్దియొప్పువలన గొప్ప మేలుచేకూరును.

తీర్థాదేవి తీర్థరాముని యక్క; ఆతనికి శైశవమున నిక్కైన యర్చ్యార నొక్కర్తుక; ఈవిషయము మనము గమనించినదియే. తీర్థరాముని విద్యాభ్యాసనము పూర్తిగానున్న కాలమునకు మున్నుగనే యామె దివంగత యయ్యెను. ఈవార్త రామునికందిన తరుణమున నతఁడలవిమాలిన హృదయవేదన ననుభవించెను. ఆతరుణమున మానవ సహజదుఃఖమున కగ్గమయ్యెను, ధీరోదాత్తుఁడనియే యనిపించుకొనెను. సామాన్యజనుఁడైన విద్యాజీవనమున దెబ్బ తినెడివాఁడే. రామతీర్థుఁడు రావీనదీ తీరమునకేగి తనకుఁ గష్టసహానశక్తిని బ్రసాదింపుమని పరమేశ్వరుని చరణముల శరణుఁజొచ్చెను. తనమనస్సు నిరంతరాయముగ నుండఁగోరెను.

లాహోరు ప్రభుత్వకళాశాలాధ్యక్షుఁడు బెల్వండితుఁడొక నాఁడు సాయంసమయ విహారార్థము కాఁబోలు నదీతీరమునకు వచ్చెను. ఆసమయమున రాముఁడచట ప్రకృతిసౌఖ్యానందము లాస్వాదముగా ననుభవించుచుండెను. పండితుఁడతనిజూచి చేసన్న చేఁ దనకడకు రాఁగోరెను. రాముఁడతని నతిభక్తిఁజేరి వినతుఁడై సమీపమున నిలువఁబడెను. బెల్వండితుఁడు అతని వినయసంపత్తి విద్యావిభూతికి నిదర్శనముగాఁ దలంచి యతి గౌరవమునఁ జూడఁ దొడఁగెను. "సులోచనము లేల?" యని సౌజన్య ముట్టిపడ రాముని నడుగ నతఁడు తన నేత్రవ్యాధిని గురించి సంక్షిప్తముగ నుడివెను. ఇంతలో వర్షము గురియఁ

జొచ్చెను. "గాకుగెందు కుపయోగింప" వని పండితుని ప్రశ్న. రాముఁడు మౌనము వహించెను. "నీ తలిదండ్రులు సంపన్నులా? ఆపన్నులా?" యని పండితుఁ డడుగ రాముఁ డత్తనికిఁ దగురీతిని దెల్పెను. పండితుఁడు ప్రీతుఁడై తన బండిలోఁ గూర్చుండఁ జేసి కొని తన యింటికిఁ గొంపోయెను. మార్గమధ్యమున బండిలో నవిచ్ఛిన్నముగాఁ బ్రసంగము సాఁగుచుండెను. రాముఁడు తాను కంఠస్థమొనర్చిన సుప్రసిద్ధాంగ్ల గీతికల శ్రావ్యమధుర కంఠస్వర ముట్టిపడ గానమొనర్చెను. తాను ప్రతివిషయముపైఁగల పాఠ్య గ్రంథములుమాత్రమేగాక వాని కనుబంధములుగ ననేక గ్రంథ ములు పఠించుననియుఁ దెలిపెను. ఈ చరిత్ర మంతయు విని పెల్పండితుఁ డత్యధిక హర్షవివశుఁ డయ్యెను. 'విద్యావంతుల పరిశ్రమము విద్వాంసులకే తెలియును' అను లోకోక్తి కీసంద ర్భము ప్రబల సాక్ష్యము. విద్యాభ్యాసానంతరము రాముఁడు చేయఁదలఁచుకొన్న పనినిగూర్చి ప్రస్తావనరాఁగా నతఁడు తన విద్యను మానవసేవ కుపయోగింపఁ దలంపని తెలిపెను. ఇది యెంతటి యుత్తమాదర్శము! ప్రభుత్వోద్యోగమే విద్యకు ఫల మని తలఁచు ప్రజానీక మీతని నాదర్శముగఁగొని తమ యాశ యమును మార్చుకొని దేశాభ్యున్నతికిఁ దోడ్పడునుగాక !

## జీవనసమస్య - ఉపాధ్యాయ జీవనము

క్రీ. శ. 1895 ఏప్రియల్ మాసమున విశ్వవిద్యాలయ పరీక్షా ఫలితములు ప్రకటింపఁబడెను. మన తీర్థరామగోస్వామి ఎం. ఏ పరీక్షయందు తన యభిమానవిషయమగు గణితశాస్త్ర మున విశిష్టుఁడై విజయ విరాజితుఁ డయ్యెను.

నే డాతఁడు సిద్ధసంకల్పుఁడు. అతఁ డేలక్ష్యము నాసించి జనకుని ధిక్కరించి లోకైక జనకుని చరణములు శరణుఁ జొచ్చి కఠిన పరీక్షలకు గుఱియై సంకల్పదార్ఢ్య ముంకువగా నిల్చెనో యా లక్ష్యమును - ఆ యాంగ్లవిద్యా పారమ్యమును - చేఁ జిక్కించుకొన్నాఁడు. ఇది వాస్తవముగ నహంకరింప వలసిన యవసరము. అతఁడు దుర్భర దారిద్ర్యాంధకారమున స్వయం సహాయశీలుఁడై పయనించి కృతార్థుఁడైనవాఁడు గదా! ఇప్పు డాతని వయస్సిరువదిరెండు మాత్రము.

అతఁడీ యఖండవిజయమున కుప్పొంగలేదు. అహంకార మతని దరిజేరలేదు. అతఁ డీ తరుణమునఁ దనకు విద్యాభ్యాస కాలమునఁ దోడ్పడుచువచ్చిన యొక సమీప బంధువగు డాక్టరు రఘునాథమల్లు అను నతనికి వ్రాసిన లేఖలోని ముఖ్యాంశములు గమనీయములు: "దైవకృపవలన నాకు విజయము లభించినది. ఏ భారత విశ్వవిద్యాలయమునను ఎన్నఁడును గణితమున నిట్టి కఠిన సమస్య లిచ్చియుండలేదు. నా విజయమునకు హేతువులు భగవానుని యపారకృపయు మీ యమోఘాశీస్సులును." ఆహా! ఎంతటి మనోహర మీ వచనరచన! ఎంతటి నిగర్వచూడామణి తీర్థరాముఁడు!!

ఇల్లలుకుటతోడనే పండుగ యయ్యెనా? పరీక్షలో గెలుపొంది పట్టభద్రుఁడైనంతన భారత యువజనుని కర్తవ్య మంతరించెనా? 'ముందున్నది మొసళ్ళపండుగ' యన్నట్లు జీవనసమస్య యెదురగును. అది దుష్కరగణితశాస్త్ర సమస్యకంటె నధిక దుష్కరమై పరిష్కర్తను బలుబాములఁ బాలొనర్చును. ఆంగ్ల విద్యను మన దేశమునఁ బ్రవేశపెట్టుచో మహాశయుఁడు మెకాలే

యు న్దేశించినట్లు ఇంగ్లీషు విద్యాభ్యాసము భారతీయ చిరదాస్యమునకుఁ గారణమైనది. ఆంగ్ల విద్యాభ్యాసమువలన సత్ఫలములు కొన్ని లేకపోలేదు. ఆవియన్నియు నది సృజించిన నిరుద్యోగ సమస్యముందు నిష్ప్రయోజనములై పోవుచున్నవి. ఆంగ్ల విద్యాధికులు ప్రభుత్వోద్యోగమునకుఁ దక్క కాయకష్టమునకుఁ బనికి రారు. అతఁడు కలము గిలుకరింపనేగాని కలయంపి జిలుకరింప నేర్వఁజాలఁడు. 'తెక్కాడిన డొక్కాడదు' యను కార్మికుఁడీ యుపాధ్యాయునికన్న నెన్నో మడుంగులు సుఖి.

ఈ జీవనసమస్యయే తీర్థరాము నెదుర్కొనినది. మెట్రిక్యులేషను మెట్టెక్కిననాఁడే గడి కదలనీయని తండ్రి యాశ కీనాఁడు నేరయుండునా? ఇల్లాలు, పిల్లలు, వచ్చిపోవు బంధుజనులుగల కుటుంబభార ముండనే యున్నది. వృద్ధుఁడై యున్న గురుఁడు ధన్నాజీయును దనపై గంపెఁడాశ పెట్టుకొని యున్నాఁడు. ఏమి చేయవలయును? ఉద్యోగమెట లభింపఁ గలదు?

జీవితవిధానమునందలి నిమ్నోన్నత తారతమ్యముల నతఁ డెన్నఁడును లక్షింపలేదు. లాహోరు ప్రభుత్వకళాశాలాధ్యక్షుఁడు తీర్థరాముని పేరును ప్రావిన్షియల్ సివిల్ సర్వీసునకుఁ బంపఁ దలఁచెను. కాని రాముఁ డాతనితో "నాకృషి మహాఫలము నమ్ముకోఁ దలపెట్టలేదు. దాని మాధుర్యమును మానవకోటి కందఁజేయుట నా యాకాంక్ష" యని నుడివెను.

అతఁడు వాంఛించినది యుపాధ్యాయవృత్తి. వృత్తులందత్యుత్తమవృత్తి యుపాధ్యాయవృత్తి యనునది యెల్లరు నిత్యము పఠించు సూక్తియే. ఈ సూక్తి యాచరణమున నెట్లున్నదియు ననుభవజ్ఞులకుఁ గ్రొత్తకాదు. ఎట్లైనను ఈసూక్తి రూపాయకుఁ

బహూజనాలు సత్యమే. తీర్థరాముఁ డద్దాని వరించుట యతని మహనీయ మనస్సత్త్వానుగుణముగనే యని యూహించుట పొల్లుగాదు.

అతనికి విదేశీయ విద్యావేతన మెద్దియో లభించుననియుఁ బలువు రాసించిరి. అదృష్టముననో దురదృష్టముననో యా యాశ ఫలించలేదు. మీరట్ కాలేజీలోను బారల్లీ కాలేజీలోను లెక్చరరు పదవుల కవకాశము కలదని విని యాచోట్లకు దరఖాస్తుచేసెను. మిత్రులు కొందఱతనిని రాష్ట్రాంతరమున కేగవలదని కోరిరి. ఆ కాలేజీల వారలును రాష్ట్ర విభిన్న భావమును బురస్కరించుకొనియే యతని యర్జీని నిరాకరించిరి. 'ప్రపంచమే నాది' యను రామతీర్థునకు రాష్ట్రాంతరము, దేశాంతరము గలదా! అతని యంతస్తత్త్వపు టంతరువునకు నాయా కాలేజీల వారేల వత్తురు? మిత్రులకు నంతటి సమరసభావమేల సంఘటిల్లును? అమృతసరమున గణితాధ్యాపకుఁడు సెలవు పెట్టుట రామునకు దెలియరాఁగా నందులకుఁ బ్రయత్నించెను. ఆయుద్యోగమునకు వయఃపరిమితి దాటుటమూలమున నుద్యోగ విరమణము గావింపనున్న యొకని షణ్మాసక వత్సరకాలము అనుమతించి యాహ్వానించిరి. అందునఁ దీర్థునికీ యత్నమునను జుక్కెదురే. అతఁడు పెషావరులో నొక యున్నతపాఠశాలలోఁ బ్రధానోపాధ్యాయుని పదవికి అర్జీచేయఁ దలపెట్టెను. జెల్వండితుఁడు పాఠశాలకు విద్యాధికారులు వ్యతిరేకులుగ నుండుట దెలిసి యాప్రయత్నమునుండి మరల్చెను. విద్యాశాఖలోఁ బనిచేయఁ దలంచి 'డైరక్టరాఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్సు'కు బలవత్తరమగు సిఫారసుతో దరఖాస్తు చేసెను. కాని యదియు బుట్టదాఖ

లయ్యెను. జెల్వుండీసుని యమూల్యాదేశానుసారము విద్యార్థులకుఁ బ్రత్యేక శిక్షణమివ్వఁ దలపెట్టెను. యఫ్. ఏ. విద్యార్థులకు నెలకుఁ బది రూపాయలు, బి. ఏ. విద్యార్థులకు నెలకుఁ బదియేను రూపాయలును బుచ్చుకొని యొక్కొక్కతరగతికి వేర్వేఱుగ వారమునకు మూఁడుపన్యాసము లీయఁబడునని ప్రకటించెను. ఈయుద్యమము కొంతకాల ముత్సాహకరముగ నడచినది. యూరోపియనులు, అధ్యాపకులు సైతము ఇతని తరగతులలోఁ జేరిరి. అతఁడును విద్యార్థులకుఁ గల్పతరువై వారి లోపముల వారించుచుండెను. తుద కతనికడ నొకవిద్యార్థి మాత్రము మిగిలెను. అందుచే నీవృత్తి యంత ప్రోత్సాహకరముగ సాఁగలేదు. ఐనను నతఁడు నిర్వ్యాంద్యుఁడై, భగవంతునియందుఁ బరిపూర్ణ విశ్వాసియై యుండెను. అతఁడీ సమయమున ధన్నరామునకు వ్రాసిన లేఖలలో నొకట నిట్లుండెను:

'పేదవాఁడు క్షుధార్తుఁడు పృథ్వినెవఁడు
లేఁడు; యాథార్థ్యమునకు నెవ్వాఁడుగాని
తనదు పేటికలోన రత్నము లవారి
గాఁగఁగలవాఁడె; తెలిచు మార్గంబెఱుఁగక
బిచ్చ గాఁడనటంచుఁ దెల్విని దొలఁగి
వీధులందున ద్రిమ్మరు విసువులేక'

ఇట్లు యథార్థ తత్త్వజ్ఞుఁడై యఖండ మనశ్శాంతి ననుభవించుచుండినను విశ్రాంతి నెఱుఁగని కృషి కతన భౌతిక శరీర మనారోగ్యమునకు గుఱి యయ్యెను. మురళీవాలకేగి కొలఁది వారములు విశ్రాంతితీసికొని మఱల లాహోరునకు వచ్చెను. ఈ పర్యాయ ముద్యోగప్రయత్నముమాని ప్రజాహిత కర్మ కలాప

ములతోఁ బాల్గొన నుత్సాహియై లాహోరు సనాతన ధర్మసభ యంతశ్శాఖయగు విద్యాసంఘమునకు సభ్యుఁడుగను మఱొక శాఖకుఁ గార్యదర్శిగను నెన్నుకొనఁబడి పనిచేయఁజొచ్చెను. ఈప్రాటకు బత్తెమెట్లాయని యెన్నఁడును వాపోయి యెఱుఁగఁడు. 'పుట్టించినవాఁడు పూరి మేపఁడు' అను విశ్వాస మతనికగ్గలముగఁ గలదు.

ఎట్టకేలకు 1895 సెప్టెంబరు నెలలో శాయిల్ కోట మిషన్ స్కూలులో ద్వితీయాధ్యాపకుఁడుగఁ గుదిరెను. అతఁడా యుద్యోగమున నానెల పదునాఱవ తేదీనాఁడు ప్రవేశించెను.

ఆతని యఖండకీర్తి యచిరకాలమున విద్యార్థులను విద్యాధికులను తండోపతండముల నాకర్షించినది. బోధనమున నద్వితీయుఁడు గావున నతని కీర్తివ్యాప్తి యక్కజము కాదు. మధువు గలతావునకు మధుపములువచ్చు టబ్బురము కాదు గదా!

శాయిల్ కోటలో నున్నపుడతని వేతనము ఎనుబది రూప్యములు. ఆ కొలఁది జీతములోనే మఱల విద్యార్థులకుఁ బాలు పంచువాఁడు. పాలతని కిష్టము. పాలు సంపూర్ణాహారమని స్వానుభవమునఁ గ్రహించిన సత్యమగుటచేతను దాను గ్రహించిన సత్యము ననుష్ఠించుటయేగాక యితరులును తదనుష్ఠానమున సౌఖ్య మందవలయునను తలంపు గలవాఁడగుటచేతను, పాలను గూర్చి విద్యార్థిలోకమును బ్రబోధించు చుండువాఁడు. అంతియేగాక తనపేర నేబాలుఁడైనను పాలమ్ముచోట పాలు పుచ్చుకొనుట కనుమతించెను. వారు త్రాగిన పాలకైన మొత్తమును జీతము వచ్చుటతోడనే చెల్లించుచుండెను. ఒక మిత్రునియొద్ద

నొక యవసరమునిమిత్త మొక రూప్య మప్పుగఁ దీసికొనెను. అది తనకెట్లు లెందుల కుపకరించెనోగాని యా రూపాయి ననేక పర్యాయములు చెల్లించెను. అప్పిచ్చిన రూపాయికి బదులుగ మనము సూపవలసిన కృతజ్ఞత యెన్నియారెట్లు లుండునని యతఁడు తెలుపుచుండెను.

అతఁ డిట్లు పాఠశాలలో నుద్యోగము సేయుచునే సనాతనధర్మ సభాపక్షమున మతప్రబోధకోపన్యాసము లటనట విరివిగ నిచ్చుచుండెను. అతనిని సమీపించిన యొక్కొక్కఁడు ధ్యాననిష్ఠాగరిష్ఠుఁ డగుచుండెను; అతనిని దైవముగఁ దలపోయు చుండెను. అతఁడొకపర్యాయము శాయిల్కోటలో నుపన్యాస మొసఁగెను. ఆ యుపన్యాసమునకుఁ దగినంత బహిరంగ ప్రకటనము జరుగలేదు. ఐనను ఈవార్త యప్పుడే నగరమున నలుగెలంకులకుఁ బ్రాకినది. డిప్యూటీ కలెక్టరు మున్నగు నున్నతోద్యోగులు, విద్యావంతులు, వేనవేలు సామాన్యజనులు ఆ యావరణము నంతయు నాక్రమించుకొనిరి. ఆనాఁటి యుపన్యాసము దైవభక్తిని మాత్రమేగాక దేశభక్తినిగూడఁ బ్రబోధించినది. ప్రజలు వక్తృత్వమునకుఁ బరవశులై యశ్రుపూరిత లోచనులైరి. మఱియొక యుపన్యాస సందర్భమున సభ్యులెల్ల రతనిసాన్నిధ్యము నమూల్యముగ భావించి యతఁడునిర్దేశించినయట్టులు రెండుగంటలకాలము ధ్యానముద్రవహించి కూర్చుండిరి. అతడు నట్లేకూర్చుండి యనంతరము రెండుగంటలకాల మద్భుతముగ నుపన్యసించినాఁడు. అతనికి జయప్రదముగఁ జేసిన యొక యుపన్యాసమువలన లేక యొక ధర్మకార్య నిర్వహణమువలనఁగలిగిన యానందము ముందు రాజధనాగారమైనను తృణప్రాయమను నభిప్రాయము గలదు.

శాయిల్‌కోట పాఠశాలకు సంబంధించిన భోజనశాలకు మహామ్మదీయుఁ డొకఁడు సూపరింటెండెంటుగా నియోజితుఁడై యుండెను. అతఁ డొకింత యహంకరించి సార్వజనీన సౌకర్యమునకు వెలిగా నొక యకృత్యము నచట గావించెను. దానితో నతఁడు దొలఁగింపఁబడి యతనిస్థానమున తీర్థరాముఁడు నియుక్తుఁడయ్యెను. తీర్థరాముఁడు సర్వమత సౌమనస్యమును పుట్టినదాది బాటించువాఁడుగనుక నతఁడన్నిమతములకు కులములకుఁ జెందిన విద్యార్థుల ప్రత్యేక సౌకర్యములఁ బాటించుచు వారికిఁ గంటికి ఱెప్పవోలె రక్షకత్వము వహించెను.

ఇట్లచ్చట నతఁడు శ్లాఘాపాత్రముగఁ గృషిసల్పుచుండెను గాని యచటి శీతోష్ణస్థితి యతని శరీరమునకుఁ బడక యనారోగ్యవంతుఁ డయ్యెను. ఇంతలో నతఁడు చిరమభిలషించు నుద్యోగమతని కబ్బెను. లాహోరులోఁ దాను జదివిన కళాశాలలో గణితాధ్యాపక పదవి లభించెను. ఇంకేమి? పెరిగిన ఇంటికే పెత్తనము లభించెను. ఆనందమున కవధియుండునా? 1869 లో ఏప్రియల్ మాసమున ద్వితీయాధ్యాపకుఁడుగడు పిమ్మట నొక మాసమునకుఁ బ్రధానాధ్యాపకుఁడుగను నియమితుఁడై యా కళాశాలలోఁ దన బోధనాకౌశలమును జూపుట కుద్యమించెను.

ఒక పేదబ్రాహ్మణబాలుఁడు విశ్వవిద్యాలయమున నిరంతరాంతరాయ పరిపంథివర్గము నెదుర్కొనుచు బహూకృతుఁ డగుటయు, తాఁ జదివిన కళాశాలలోఁ దా నధ్యాపకుఁ డగుటయు గర్వహేతువులయ్యును, అవియే యతని మహనీయతకు నిదర్శనములు కావు గనుక దూరదృష్టితో నాలోచించిన, రాముని భవిష్యజ్జీవితముతోఁ బోల్చిన నింతదనుకఁ గడచిన కాలమంత

ప్రశస్తమైనదికాదు. స్వామిరామతీర్థుని జీవిత కావ్యసర్గలలో మధురతమమైనది, ఆహ్లాదజనకమైనది ఉత్తర చరితము. ఆత్మ సాక్షాత్కారానుభూతికి అంతరాందోళనముయొక్క బాహ్య ప్రకృతినిమాత్రమే మనము పరిశీలించితిమి.

## అధ్యాపక వృత్తి

రాముఁడాదర్శ విద్యార్థి; ఆదర్శ విద్యాబోధకుఁడును. అతఁడు కళాశాలలో బోధించు వైఖరి యద్భుతము. అతఁడు గణితశాస్త్రమును బోధించును. "గణితశాస్త్రమును గెలుచు కెట్లు" అను శీర్షికగల వ్యాసమును వ్రాసి ముద్రించింది విద్యార్థులకు బంచిపెట్టెను. అందు ముఖ్యముగా సూచించినదిది: 'బుద్ధిబలమునకుఁ దిండిపోతుతనము ప్రబల విరోధి. తిండి మితముగఁ బుచ్చుకొన్న బుద్ధి వికసించును.

అతఁడెట్టి విద్యార్థినైనను నిరుత్సాహిని జేయఁడు. వానిలో నుత్సాహమును బూరించును. వానిని దైవముగ భావించి యట్లే సంబోధించును. "నాయనా, కృష్ణా! రమ్ము. నీవీ గణిత సమస్యను బరిష్కరింపఁగలవు. నీవు మాయను తృణీకరింపుము. జ్ఞానము ప్రసన్నమగును. బోర్డు నొద్దకుఁ బొమ్ము. ఉపక్రమింపుము. సమస్య నీకు లొంగివచ్చును. ఇదిగో వచ్చినది. చూచితివా! జవాబు. నిన్ను నీవు మఱవకుము. ఆత్మ విస్మృతియే యజ్ఞానహేతువు. ఆత్మ జాగరితమైన నాలోచనాశక్తి తీవ్రముగఁ బనిచేయును. తీవ్రాలోచన ఫలముగ ధీబల మేర్పడును." అని ప్రబోధించును. తొలుత భీతుఁడైయున్న యావిద్యార్థి నిమిషమాత్రమున నాసమస్యను

బరిష్కరించి శ్రీకృష్ణుడై యాత్మవిశ్వాసమును బడసి కృతార్థుఁడగును.

తీవ్రముగ నొకసమస్యను బరిష్కరింప సమకట్టి, తీవ్రకృషి యనంతర మది తేలని సందర్భమున దానిని మననము సేయుచు నిద్రఁ బరున్నచోఁ దెల్లవారుజామున మేల్కాంచు సరికది పరిష్కృతము గాఁగలదు. ఇదియు నతఁడు స్వానుభవమున గ్రహించి చెప్పిన విషయమే.

రెండు సంవత్సరములు మాత్రమే యతఁ డధ్యాపకుఁడుగ నుండినది. ఫర్మాన్ క్రిస్టియన్ కళాశాలలోను, ఓరియంటల్ కాలేజీలోను విద్యార్థు లతనియెడ నత్యంతానురాగమున మెలఁగిరనుట యందేమాత్రము సందేహము లేదు. అతఁడుపాధ్యాయుఁడుగ నుండియే విద్యార్జనము గావించుచుండెను. అతఁడత్యున్నత పరీక్షకు సంసిద్ధుఁడగుచుండెను. అది యే విశ్వవిద్యాలయము లందునుగాదు; సన్న్యాసాశ్రమమను పరమపవిత్ర సంస్థ యందునసే; అతఁడు బ్రహ్మజ్ఞాన సముపార్జనము సేయ నిరంతర పరిశ్రమము గావించుచుండెను.

అతఁడు దూరదేశములకుఁ దఱచుగాఁ బ్రయాణములు సాగించుచుండెను; అతని విద్యార్థులు కొందఱు అతని వెన్నంటుచుందురు. వారికి అతఁడు వేదాంతము బోధించుచుండును — ప్రాపంచిక వస్తు సముదాయమునుండి యున్నతలోకములకు వారిని గొంపోవుచుండును. ఆతని సాహచర్య భాగ్యమునకు నోచుకొనిన వారెంత ధన్యులు! ఎంతటి యదృష్టవంతులు! అతని చరణ కమల సాన్నిధ్యమున నుపవిష్టులై యమృతోజ్జ్వలోపన్యాసములఁ దనిసిన వారలు ఎంతటి సార్థక జన్ములు ? !

మానవ దుస్సాధ్యములగు విషయముల కెన్నఁడు నతఁడు దన వాక్యములందు స్థాన మీయలేదు. అతఁడనుష్ఠాన వేదాంత ప్రచారకుఁడు. అతఁడు తన విద్యార్థులకు స్వానుభవ రత్నఖనిని బంచెను. అతఁడు గణితశాస్త్రాభ్యసనముగూర్చి వ్రాసినాఁడన్నఁ దాను పరియత్నించి సాఫల్యమందిన పద్ధతులను మాత్రమే యందు సంకలిత మొనర్చెను. ప్రాణాయామముగూర్చి యుపన్యసించినాఁడనఁ దాను స్వయముగ నభ్యసించి తత్ఫల మమేయమని గ్రహించినాఁడు గనుకనే. అటులనే ఆత్మ సాక్షాత్కారముగూర్చి యతఁడు పలికినాఁడనఁ దాను స్వయముగాఁ దత్కృతి యందు గృతార్థుఁడైనాఁడు గనుకనే.

అతఁ డధ్యాపకుఁడుగఁ జేరిన రెండుమాసములకే యతని విద్యార్థులతని యాధ్యాత్మికోన్నతిని గ్రహించి కోరినమీఁదట నతఁడు భక్తినిగూర్చి యమోఘమగు నుపన్యాసమునిచ్చి వారిని దన్మయులఁ గావించెను.

ఆత్మబలమున కతఁడొక గొప్ప యుదాహరణము. తన విశ్వవిద్యాలయ విద్యాభ్యసనము సమాప్తము కాఁగానే యతఁడెంక జీవించునాయను సందేహమునకుఁ బాత్రుఁ డయ్యెను. అతని శరీరము అస్థిపంజరమాత్రముగ గోచరించెను. అతని తల యెముకలు బయటకుఁ గనుపించు కొంగమెడపై నుండెను. అతని స్వరము పీలయయ్యెను. అతఁడు చాలసేపు మాటాడిన మిక్కుటముగ నలసటఁ జెందువాఁడు. వెంటనే యారోగ్యమునుగూర్చి దృఢసంకల్పుఁడై తనస్నేహితులందఱు నచ్చెరు వందునటులు వాడు అచిరకాలముననే అత్యద్భుతదృఢగాత్రము సంపాదించుటకు తనకు సరిపడు క్రొత్తక్రొత్త వ్యాయామపద్ధతులు స్వయముగాఁ

గనిపెట్టుటయం దతనికి మిక్కుటమగు ప్రీతి. అతనికి ముఖ్యాహారము గోక్షీరము; దాని నత్యధికముగాఁ బుచ్చుకొనుచుండు వాఁడు. అన్నింటికంటె నద్భుతవేగమున నారోగ్య పునస్సంపాదనము నతఁ డొనర్చుటకు ముఖ్యకారణ మతని సంకల్ప పటిమయే. బలహీనగాత్రుఁడగు నతఁ డచిరకాలముననే కొండవాగులలో వర్షాకాలమున నీదుటకును, పార్వ తేయులు సైతము ఆశ్చర్యమగ్నులగునంతటి వేగమున హిమాలయపర్వతముల నధిరోహించుటకును, రెండుగంటలలోపుగ నమెరికను యుద్ధభటులతో ముప్పదిమైళ్ళదూరపుఁ బందెపుఁ బరుగున గెలుపు గాంచుటకును అమోఘశక్తిని గాంచినాఁడనిన నది యాత్మశక్తి గాదా?

ఇదియంతయు నతఁడు సంపాదించినది వ్యర్థమగు ప్రదర్శనమునకుఁగాదు; ఆరోగ్యకరమగు నాత్మ వసించుటకు నారోగ్యకరమగు శరీర మవసరమని గ్రహించినాఁడు గనుకనే. ఈవిషయమును ప్రపంచమునకుఁ జాటుటకు మున్నుగాఁ దానే యాచరించి యాదర్శకుఁ డయ్యెను. అతని విద్యార్థు లతని జీవితము నాదర్శముగాఁ గొనినంతనే సిద్ధసంకల్పులగుట నిస్సంశయము.

వనస్పతిజీ యతనిమిత్రుఁడు. అతఁ డొకప్పుడు 'ఆ యుద్యోగములోనే యుందువా? లేక మఱెద్దానినైనఁ బ్రయత్నింప సంకల్పము గలదా?' యని పృచ్ఛసేయ, అందులకు తీర్థరాముఁడు కుటుంబపోషణ మిచ్చించినదనుక, నందులకు సరిపడు సంపాదన ముండుదనుక దానున్న యుద్యోగమును వీడననియుఁ దదుపరి యుపన్యాసము లిచ్చుచు దేశసంచారము గావింతుననియు నుడివెను. అతఁ డెచటికేగినను విద్యార్థులకు బోధనము గావించును. ప్రాపంచిక సౌఖ్యాలాలసులైన యువజనుల నజ్ఞానాంధకారకూపమునుండి యుద్ధరించు టతని ప్రధాన సంకల్పము.

# కృష్ణ భక్త్యావేశము

తీర్థరాముఁడు భక్తిభరిత హృదయుఁడై కృష్ణప్రేమ పరవశుఁడై కృష్ణనామము వీనుసోకినమాత్ర నొడలు మఱచుచుండెను. స్వామినారాయణుఁ డాతఁడు లాహోరులోనున్న యంత్య దినములలోని యతని కృష్ణభక్త్యావేశముగూర్చి యిట్లు వ్రాసెను.

" స్వామి రాత్రిందివములు శ్రీకృష్ణుని స్మరించుచు ధ్యాన మగ్న మానసుఁడై చరించుచుండును. కృష్ణనామము పేర్కొనఁ బడినంతమాత్రమున వివశత గాంచును. పిల్లనగ్రోవి నూదు పిల్లవానినిగని యా మధురగానమున లీనుఁడై యా బాలుఁడే గోపాలుఁడను భ్రమకు వశుఁడగును. వేణుగోపాలుని దలపోయుచు రావీనదీతీరమున గంటలకొలఁది గ్రుమ్మరును."

ఒక సాయంసమయమున రావీనదీతీరమున విహరించుచు స్వామి రామతీర్థుఁ డాకాశమునఁ గ్రమ్మిన నీలజీమూతమాల నొండు గాంచెను. ' అతఁడే-యతఁడే కృష్ణుఁడు-నీలమేఘశ్యాముఁడు-దేవుఁడు. కృష్ణా, నీలమేఘము నీ శరీరచ్ఛాయ. నీవెందులకు దాఁగియున్నావో ఎందున్నావో నాకుఁ దోఁచుట లేదు. మేఘమా, నీవైన నాకేల నుడువవు? నీవు నాకన్న నెంతో యున్నతస్థానమున నున్నావు. నీవు నాకన్న నా మహోన్నతుని బాగుగఁ జూడఁగలవు. చెప్పుము. చెప్పుము. నా కృష్ణుఁడు నా మనోహరుఁడు నెందున్నాఁడో. ఆహా! మేఘమా! నీవును కృష్ణ విరహమున దుఃఖితవుసుమా! అయ్యో? నాకుఁ బ్రియునిసందర్శించు భాగ్యము లేదా? అతని గాంచనేని నన్నీ ప్రపంచము వంచించును.

ఎవనికోసము బంధుమిత్రుల నెల్లర విసర్జించి యిటఁ బరిభ్రమించు చుంటినో తెలియునా? నీకొఱకే, కృష్ణా, నీ కొఱకే.

అన్నా, వారిద, పోవుచున్నావా? పొమ్ము. కృష్ణునకు విన్నవింపుము: నా కన్నులనుండి యెటులు వర్షధారలు గురియు చున్నవో వచ్చి చూడుమని. చెప్పు మిట్లు:

వర్షానందము వాంఛింతువ? దేవా,
రమ్ము, రమ్ము, సుఖాసీనుఁడవు
గమ్ము నీవు నా కనుదమ్ములలో
నలువుఁ దెలుపు నెఱుపు నెఱిగ
వర్షించెడి మేఘమ్మదె గన.

ఓ జీవితమా, ఎంత దీర్ఘమవు? నాకీ విరహవేదన దుస్స హము. కృష్ణా! ఈపిపాసను దీర్పుము. లేదా మృత్యువునంపుము. సూర్యునకుఁ దేజమొసఁగువాఁడవు నీవు. సుధాధామునకు మనో జ్ఞత గూర్చువాఁడవును నీవే. కృష్ణా, నీ దర్శన మేల కలిగింపవు! నీ విజ్ఞాన మేల నాలో వికసింపఁ జేయవు ?

కన్నులార, మిమ్ముఁగన్న ఫలంబెన్న
సున్న కృష్ణదేవు సుప్రభావు
నరయ లేని, మీర లాఱిపోయినమేలు
శాశ్వతముగ నబ్బు సౌఖ్యచయము;
కరములార, మీరు విరిగిపోయినమేలు
హరిపదారవింద మంటలేని;
దేవ, దేవ, నాదు జీవంబు నర్పింతు
నీవు దర్శనంబు నిత్తువేని. ''

ఇదే ధోరణిలో నున్మత్తుఁడై చరించుచుండ నొకనాఁడతఁడు మూర్ఛానంతరము జాగృతిగాంచి కన్ను తెఱచునప్పటికొక సర్పము పడగవిప్పి యాడుచుండెను. అతఁడు దాని వైపునకే పరుగెత్తి "ప్రభూ, వచ్చితివా సర్పరూపమున ? రమ్ము. రమ్ము. నాఁడు గోపికల మోహింపఁజేసిన నీ సౌందర్యమును నేఁ జూడవలతును. నాకది చూపుము,'' అని యావేశపూరితుఁడై పలుకుచునే మఱల మూర్ఛితుఁ డయ్యెను.

ఒక మిత్రుఁ డిదియంతయుఁ జూచి యతని నూరార్పఁ దలఁచి, "స్వామిజీ, కృష్ణుఁడు నీలో నున్నాఁడు. ఇఁక వెలుపల దేనిని నీ వన్వేషించునది?" అని పలుక, "నాలోనా?" యని పలుకుచు నీ వెఱ్ఱిభక్తుఁడు తన చొక్కాను చించి వక్షస్థలమును గోళ్ళతోఁ జీల్చికొనఁదొడఁగి మఱల మూర్ఛలో గంటలకొలఁది పడియుండెను.

ఒకనాఁ డొక పండితుఁడు రామాయణ పారాయణము గావించుచుండెను. రాముఁ డా పురాణశ్రవణమున నొడలు మఱచి యేడువఁ దొడఁగెను. పాప మా పండితుఁ డానాఁటికిఁ బురాణమును గట్టివేయవలసినవాఁ డయ్యెను.

## మధురా - బృందావన యాత్రలు

రాముని మనస్థితి పూర్వోక్తరీతి నుండుటచే, మధురా బృందావన యాత్రలు ఎక్కుడుగ నతఁడు గావింపఁ దొడఁగెను. గోపీబృందమునకు బృందావన చంద్రుని యెడఁ గల గాఢప్రేమకు నిదర్శనముగ రాసక్రీడలోఁ బాల్గొనువాఁడు. దీనిగూర్చి తనస్నేహితునితో నిట్లు తెలిపెను. "నే నొకనాఁడు నదిలో స్నానము

గావించుతఱిని నీలమేఘశ్యాముడగు గోపాలకృష్ణుఁడు కాళీయ ఫణి ఫణాగ్రములపై నృత్యము గావించుచు, మురళి యధర చుంబనమున ధన్యమగుచుండ సుముఖుఁడై నా యెట్టయెదుటఁ బ్రత్యక్షమయ్యెను. మేము పరస్పర గాఢాలింగన పరవశుల మైతిమి. అనంతర మతఁ డంతర్హితుఁ డయ్యెను.'' 'ఇం దసాధారణ మేమియు లే'దనియు నతఁడే యిట్లు నుడివెను: "మనస్సు ఒకదానియందు గాఢానురక్త యయ్యెనేని, అది దృశ్యరూపము చెందును. మధుర స్వప్నముల మనము గాంతుము. అది యంతయు భావనకు రూపొసంగుట, చిత్తైకాగ్రత."

రామతీర్థుడు కృష్ణభక్తి రూపై పరఁగినాఁడు. 1896 ఆగస్టులో నతఁడు సుప్రసిద్ధ సనాతన ధర్మ ప్రచారకుఁడైన పండిత దీనదయాళుశర్మతో మధురా బృందావనముల కేగెను. ఈ తీర్థయాత్రలో కృష్ణ విహారస్థలములు రాముఁడు దర్శించినాఁడు. అడుగడుగునకు బృందావనమున రాముఁడు శ్రీకృష్ణ స్తోత్రమును గానముచేయుచు, విరహావేదనా పరవశుఁడైనాఁడు. కృష్ణవిహార స్థలములైన వ్రజమండలములలోని వృక్షములు, పుష్పములు, వాకలు చూచి వాని మహాదృష్టమును గీర్తించినాఁడు. రాముని పారవశ్య బాష్పవర్షముతో గోకులమార్గము లార్ద్రములైనవి. ఆయన కృష్ణగానముతో బృందావనము పులకించినది. పండిత దీనదయాళుఁడు రాముని కృష్ణభక్త్యున్మత్తతను మధురలోని ప్రజలకుఁ గొంత పంచిపెట్టఁ దలంపుగొని రాముఁ డుపన్యసింప నొక బహిరంగసభ నేర్పాటు గావించెను. రాముని యుపన్యాసవాహిని రెండవ యమునాస్రవంతియా! యనఁ దోఁచినది. రాముని భక్తి తన్మ యాలాపములకుఁ బ్రజలు పర

వశులైరి. వారి నేత్రము లానందబాష్ప పూరితములైనవి.

ఆధ్యాత్మిక విచారములు హెచ్చైన కొలఁదిని కళాశాలయందుండు గంటలు తగ్గుచుండెను. తుదకుఁ గుటుంబ మునువీడి యడవులఁ బట్టెను. అతఁ డిరువదినాలుగవయేట ననఁగా 1897 సం. అక్టోబరు మాసమునఁ బూర్తిగ నాధ్యాత్మిక జీవనమునకు వశుఁడయ్యెను. ఏతత్సందర్భమున నతని మనస్థ్సితి నీక్రింద నుదాహృతమగు నతనిజాబు స్పష్టీకరించును.

జనకా,

సాష్టాంగ నమస్కారములు.

రాముని శరీర మిదివఱకే అన్యాధీనమైనది; అది యిఁక అతనిదికాదు. రాముఁడిఁక 'తన' 'మన' లకు భేదము గమనింపఁడు. ఈనాఁడు దీపావళీ పుణ్యదివసమున, నతఁడు శరీర సంబంధముల నన్నింటిని సన్న్యసించి వానిని భగవ దధీనము గావించినాఁడు. ఇదిమొదలు రామునేమైన మీరడుగఁ గోరెద రేని, అతని ప్రభుఁడైన భగవానునికే మనవి సేసికొనవలయును. అతఁ డత్యద్భుతముగా మూఁడు వారములనుండి రాముని కార్యముల నిర్వహించు చున్నాఁడు. మీకుమాత్ర మతఁడెందు లకుఁ జేయఁజాలఁడు? అతని యాజ్ఞానువర్తియై రామునిగూర్చి యేమాత్రము విచారింపకుఁడు. గోస్వాములకు గోస్వామియగు శ్రీకృష్ణపరమాత్ముఁ డైశ్వర్య రత్నాకరము. శాశ్వతమగు నీయైశ్వర్యమునువీడి నశ్వరమగు ప్రాపంచికైశ్వర్యమున వ్యామోహ పడుట మంచిదికాదు. అది లభింపలేదని విచార మగ్నులగుట లజ్జాకరము. సత్యమైనది మీయైశ్వర్యమో, నా ప్రభుని యైశ్వర్యమో వచింపుఁడు.''

ఇది తులసీదాసు తుకారాముల గీతములకుఁ బ్రతిసిస్వనము. ఇవి యకళంకిత భగవద్భక్తిని సన్న్యాసదీక్షను సూచించును.

అతఁ డచటి కేగినను, ఉపన్యాసము లిచ్చుచుండెను. అతఁడు అమృతసరమునందలి సనాతన ధర్మ సభా కార్యదర్శియై తత్సభా వార్షికోత్సవసందర్భమున నతఁ డొసఁగిన యుపన్యాసము తనపైఁ దెచ్చిన పరివర్తనముగూర్చి నారాయణస్వామి యిట్లు వివరించెను.

"అచటి యుపన్యాసము లన్నింట రామతీర్థునిదే యగ్రగణ్యము. అది సందేశ సమన్వితము, సంస్కరణ స్వభావము కలది. భగవద్గీతను గూర్చియు రాసక్రీడగూర్చియు నాతఁడు నుడివిన భావములు నాలోఁ దెచ్చినఫలము చెప్పశక్యముకాదు. అదివఱలో రాసక్రీడ అర్థరహితమగు మతాచారమనియు, శ్రీకృష్ణుని జీవితమునఁ బ్రశంసనీయములగు నంశములు లేవనియు నాయభిప్రాయము. ఆతని వక్తృత్వ మహాచ్ఛక్తి వెంటనే ఏతదంశములఁగూర్చి చదువుటకుఁ బ్రోత్సహించెను. చదువుట తోడనే వాని నుడువులలోని యాథార్థ్యమును గ్రహించి ప్రశంసింపఁ గలిగినాఁడను."

ద్వారకయందలి శ్రీజగద్గురు శంకరాచార్య స్వాముల వారు లాహోరులో రాముని గలిసిరి. అతని యాధ్యాత్మిక సంపత్తికి అచ్చెరువంది, తమ సంచారసందర్భములలో నెచ్చటను నింతటి మహనీయాత్మను గాంచలేదనిరి. వారు రాముని సాహచర్యమును వాంఛించుటచే, వారితోఁ గాశ్మీరమువఱక రాముఁ డేగెను. శ్రీనగరునకు వచ్చినతోడనే శంకరులు స్వప్రయత్నము ననే రాము నుండఁగోరి బ్రహ్మానందపదవి యచిరకాలముననే సిద్ధింపఁగలదని సమాధాన పఱచిరి. రాముఁ డంతటనుండియు

నుపనిషత్పఠనమునఁ దనయవధానమును కేంద్రీకరించెను. అతఁడీ పవిత్ర గ్రంథముల సంపూర్ణముగ నవగాహనము సేసికొనెను. ఆతని స్వభావము, బోధనము ప్రజలను పరవశులుగాఁ జేయఁ జొచ్చెను.

స్వామి నారాయణునకుఁ బ్రథమమున వేదాంత విచారణమునం దాసక్తి లేదు. గోస్వామి రామతీర్థుని యాదేశానుసారమే గీతాపఠనము గావించెను. "గీత ఉత్తమ కృతి. దానిని మననముసేయుచు నందలి స్వారస్యము నాస్వాదించుచుఁ జదువఁ దొడంగిన నైహికప్రధానుఁడగు మానవుఁడు భౌతిక వస్తువులం దెంతటి నమ్మకము గలిగియుండునో, అంతటికంటె నుత్కృష్టతరమగు నిశ్చల విశ్వాసము దైవమునందు గలిగియుండును. ప్రియ మిత్రమా, ఇంద్రియ లోలురకును గీతవంటి యుత్కృష్ట గ్రంథములఁ బఠించుటవలన నాత్మ సాక్షాత్కారానుభూతి కలుగుచున్నది," అని తీర్థరామస్వామి తెలిపిన పలుకులు సత్యములని గ్రహింపఁ గలిగెను. స్వామి నారాయణుఁ డితర వేదాంత గ్రంథములనైతము కొన్నింటిఁ బఠించెను. అవి దురవగాహములు కాఁగా సుప్రసిద్ధులగు నఖండ పండితాఖండలురఁ గొందఱ సమీపించి యించుకేని తృప్తివహింప నేరఁడయ్యెను. రాముని సమీపించెనో లేదో భాను కరస్పర్శమున మంచువలె సంశయములు పటాపంచలయ్యెను. పిమ్మట నతఁ డిట్లు వలికెను: "అటుపై నా మనస్సు స్వేచ్ఛ ననుభవించెను. స్వామితోఁగూడి యుపనిషత్తులఁ బఠింపఁ దొడఁగినాఁడను. నా యాచార్యుఁడు తపోనిమగ్నుఁడుకాఁగా నతని సేవయందు నేను నిమగ్నుఁడ నగుదును. అంతటినుండియు నేను పూర్ణముగా నతనివాఁడ నైతిని."

తీర్థరాముఁడు తీక్ష్ణమగు గ్రీష్మమున లాహోరులో నడచుచున్న తరుణమున నతని పాదములంటి కొంద ఱవి శీతములుగ నుంటఁగని యక్కజంపడిరి. అప్పు డాతఁ డిట్లు సహజ మార్దవ సమన్వితముగఁ బలికెను. "నేనిపుడు లాహోరులో నడియెండలో నడచుట లేదు. నే నిప్పుడుకా దెప్పుడును దివ్య మందాకినీ తరంగ డోలలో నడయాడుచుందును. అమృతమయములగు నామహానది యలలస్పర్శచే నాయంఘ్రితలములు శీతలత వహించియుందును." చూచుటకు లాహోరు వీధులలోఁ దిరుగుచుండినను, మానసికముగ నాతఁ డుడువీధులలో సంచరించుచుండె ననుటకు సందియము లేదు.

అతనికొక చిన్న గడియారము గలదు. అతని నెవరైన "స్వామిజీ, ఇప్పుడు టైమెంత?" యని ప్రశ్నింతురా వెంటనే గడియారమువైపు దీవ్ర దృక్కులఁ బ్రసరింపఁజేసి ప్రసన్న వదనుఁడై చిఱునవ్వునవ్వుచుఁ బృచ్ఛకునిజూచి "డియర్ వన్; ఇటీజ్ వన్" అని పలుకును. వా రందులకు, "ఇదియేమి స్వామిజీ, మే మెప్పుడడిగినను మార్పు లేకుండ నొకే సమాధానమిత్తువు" అనిన "రాముని గడియారమట్టిది. అనుంగు నెచ్చెలీ, అం దెప్పుడును ఒకటియే" అని పరమార్థ మట్టిపడఁ బలుకును.

## వివేకానంద సందర్శనము

ప్రపంచశాంతి భద్రతలు మానవుని విజ్ఞాన వికాసములపై నాధారపడియున్నవి. తనకును దన పొరుగువానికిని గల యభేదమును గుర్తించెనా మానవుఁడు, జగమంతయుఁ బ్రేమమయమై యానందవిభూతుల కాలవాలమై స్వర్లోక వాసులకుఁ బండ్లు

బులియఁ జేయదా? ఈ విజ్ఞానము వేదములందును ఉపనిషత్తుల యందును గానము సేయఁబడినదే. దీనిని లోకమున వ్యాప్తి గావింప సమకట్టి విజయమందిన మహామహుఁడు వివేకానందుఁడు. అతని యడుగుజాడలలో నడచియుండి, యతనికంటె నింకొక యడుగు ముందునకుఁబోయి యత్యంత మధుర భావావేశ పూర్ణ జీవితము నెఱపి కృతార్థుఁడైనవాఁడు మన రామతీర్థుఁడు.

అఖిల లోకారాధ్యుఁడును, అపర కాళిదాసుఁడును, అవతార పురుషుఁడును నగు శ్రీ రామకృష్ణపరమహంసుని పదస్పర్శచే బ్రహ్మాండోదరుఁ బ్రత్యక్షముగఁ గాంచి బ్రహ్మతత్త్వవేత్తయై యాజన్మ బ్రహ్మచర్యవ్రత నిష్ఠా గరిష్ఠుఁడైన మహనీయుఁడు వివేకానందస్వామి. విశ్వమత మహాసభలో భారతీయ మత మహత్త్వమును రూపించి యమెరికా ఖండమున నఖండ గౌరవ ప్రతిష్ఠలఁగాంచిన యద్భుతవక్త యాతఁడు. అతఁడు రామతీర్థుఁడు కళాశాలాధ్యాపకుఁడుగనుండి, యాధ్యాత్మికముగ నున్నతి నాకాంక్షించు దినములలోనే లాహోరు నగరమునకు విచ్చేసెను.

అతఁడు ధ్యానసింగు హవేలీ యనుచోట బసచేసెను. పరివ్రాజకతల్లజుఁ డతఁ డుపన్యసించునని తెలియుట తోడనే నగరవాసు లాబాలగోపాలము వచ్చిరి. ఉపన్యాసమునకై యేర్పాటు గావింపఁబడిన శాల జనసమ్మర్దనమున కిట కిటలాడఁ జొచ్చినది. ప్రజాసమూహములు తండోపతండములుగ వచ్చుచున్నారు. అందఱును స్వామి వాగమృతపానాసక్తులే – ఎవరిని గాదందురు? ఎవరు గాదందురు? ఎవరిని ఎవరుగాదనిన నెవరూరకొందురు. ఇదియంతయు శ్రీ వివేకానందుఁడు చూచి

"ఇదిగో, నా యుపన్యాసమును బరిమితముగాని సువిశాల ప్రదేశమున నారంభించుచున్నా"నని యాకాశమే పైకప్పుగాఁ గల మైదానమున నొక యెత్తైన తిన్నె నధిరోహించినాఁడు. జనసమూహ మంతయుఁ బిన్న పెద్ద లనుభేదములేక ప్రియజనయిత్రి ధరిత్రి యంకతలమున హాయిగ నుపవిష్టులైనారు. ఇఁక నుపన్యాసమా! దాని యద్భుతశక్తి వర్ణింప నలవిగాదు. వివేకానంద కేసరి విజృంభించి గర్జింప నారంభించుసరికి మానవ హృదయములలోని భయభ్రాంతులను మృగవిశేషము లన్నియుఁ బలాయనము చిత్తగించినవి. వివేకానంద మేఘము అద్వైతామృతమును మానవ మేధశ్శిఖరములపైఁ గుంభద్రోణములుగఁ గురిపించినది.

అతని యుపన్యాసము లింకెన్నో యెన్నో విషయముల మీఁద బోసు సర్కసు పెండాలులో నీయఁబడినవి. అతఁడు భక్తి జ్ఞాన కర్మలఁగూర్చియు వేదాంతమును గూర్చియు నమోఘములగు నుపన్యాసము లిచ్చినాఁడు. ఈ యుపన్యాసము లన్నియు సనాతనధర్మ సభవారి యాధ్వర్యముననే జరిగినవి. అనఁగా ఆ సభకుఁ గార్యదర్శిగనున్న రామతీర్థుఁడే యీ సభాకార్యక్రమములకు మూల స్తంభముగ నిల్చినది. అతఁడు వివేకానందునితీవ్రావేశము త్యాగదీక్షచూచి తన్మయుఁడై తాను నట్టివాఁడై జీవితమును చరితార్థముగావింపఁ దలపోసియుండును. అతనికి తనభవిష్యజ్జీవనవిధానమున నొక దృఢమైన నిశ్చయ మేర్పడియుండును.

## గృహస్థ జీవనము

'గృహస్థాశ్రమ తత్త్వము' అను చిఱుపొత్తము రచించిన రామతీర్థుని గృహస్థజీవన మెట్లుండెనో యొకింత ఈ తరుణమునఁ బ్రసక్తికిఁ దెచ్చుట యసమంజసముకాదు.

రాముఁడు ప్రేమమయుఁడు. తుచ్ఛకామ వివశుఁడు గాఁడు. భార్యను సేవలము దాసిగ భావించి తృణీకరించువాఁడు గాఁడాతఁడు. తానేయాధ్యాత్మిక తత్త్వాన్వేషణమునకు తన హృదయము నంకితము గావించెనో, తన హృదయేశ్వరినిసైత మందులకే ప్రబోధించి యందామె కభిరుచిని గల్పింపఁగలిగెను. రాముని పత్ని పేరేమో మనకుఁ దెలియదు. పరమ సాధ్వియని మాత్రము తెలుపఁగలము. రాముఁడు కళాశాలలోఁ బ్రవేశించు తరుణమున నతని నిశ్చితాభిప్రాయమునుండి మరలింపఁ దలంచి యతని తండ్రి హీరానందుఁ డాతనికడ కంపఁగా నామె యేకొలఁది దినములో భర్తృసన్నిధి నుండెఁగాని యతఁడు విద్యాభ్యాసము పూర్తిగావించుదనుక నతనికొక భారముగ నుండక పుట్టినింటఁ గొంతకాలము అత్తవారింటఁ గొంతకాలముండుచు, భర్తృచరణారవిందముల నిరంతరము నెమ్మదిని ధ్యానించుచుఁ గాలము పుచ్చెను. భర్త యం. ఏ. పట్టభద్రుఁడై శాయిలోకాటలో నుపాధ్యాయవృత్తిని స్వీకరించినది మొదలు సన్న్యాసాశ్రమము గైకొనునంతదనుక నతనికిఁ దోడునీడయై యుండెను.

రాముఁడు సంసారచక్రమునఁ బరిభ్రమించుచునేయుండెను. సర్వేశ్వరు చరణసరోజ మరందముగ్రోలుచునే యుండెను. అతఁడు తామరాకుపైనున్న నీటిబొట్టు. నిద్రించుతఱి హృదయమీశ్వర విరహమునఁ బరితపించుచుండఁ గనుదములనశ్రులు గ్రమ్మి మంచుబిందువులట్లు తలగడపై జాల్వారుటాతని హృదయేశ్వరి గాంచి యతని భక్తితన్మయతకుఁ దన్మయురాలగుచుండెను.

యొగులెల్ల రొనర్చునట్లే రాముఁడు నర్ధరాత్రి వేళ మేల్కాంచి పద్మాసనస్థుఁడై ధ్యాననిష్ఠయందుండ నతని ధర్మ

పత్నియు నతని యెట్టయెదుట నప్డే కూర్చుండి యతని ముఖపద్మమున దృష్టులు ఏకాగ్రమొనర్చి యతనిని పరంధామునిగ భావించి ధ్యానించుచుండెను. ఈ యభ్యాసముకతన నామెకు హృదయ నైర్మల్యము నామెభర్తకు దేవతాత్వము సిద్ధించుచుండెను. భార్యాభర్త లొండొరులకు బంధ హేతువులుగాక మోక్ష హేతువులనుట కిదియే నిదర్శనము.

ఇట్టి యాదర్శ గృహస్థజీవనము నెఱపుటకు రాముని సంకల్పబలమే ప్రధాన కారణము. రెండవది యతనికి భాగ్యవశమున లభించిన యనుకూలవతియగు సతి. అతఁడు లాహోరులో నధ్యాపకుఁడైయున్నప్పు డతనియింటికి విధియు విరామము లేకుండ వచ్చుచుఁ బోవుచు నుండెడి బంధుమిత్రులకు నభ్యాగత జనములకు నాదరము చూపుటలో నేమాత్ర మేమరువాఁడు కాఁడు.

## సన్న్యాసస్వీకారము

కళాశాలలోఁ బని, పరీక్షాపత్రములిచ్చుట, దిద్దుట యొకవంక జరుగుచునే యున్నది. మఱియొకవంక మతప్రచారము సాఁగుచునే యున్నది. రాముని జీవితమున ననుక్షణము మార్పులు వచ్చుచునే యున్నవి. తుద కొకనాఁడతఁడు భక్త్యావేశమున నున్మత్తుఁడై కళాశాలాధ్యక్షునిఁజూచి, "నీవు క్రీస్తు భక్తుఁడవుగదా! నేనే ఏసుక్రీస్తును" అని వెఱ్ఱివానివలె పకపక నవ్వెను.

రాముఁడాయా పట్టణముల సంచారముచేయుచు నుపన్యసించుచు సత్యప్రకాశమును ప్రపంచమున విస్తరింపఁజేయఁ

దొడఁగెను. తనయొద్ద నేమాత్రము డబ్బుండినను దానిని సాధుసంతర్పణములకు వినియోగించు చుండెను. అదియే వాస్తవ మగు యజ్ఞము, త్యాగమునని రాముని యభిప్రాయము.

రాముఁడీతరుణమున 'ఆలిఫ్' అను వేదాంత పత్రికను ఉర్దూభాషలో నడపెను. 'అద్వైతామృత వర్షిణీసభ' యను వేదాంతోపన్యాసక సమాజము నొకదానిని స్థాపించెను. ఇట్టి మహోత్కృష్టకార్యములయందు దీతఁడు కొంతకాలము గడపెను. ఆత్మ పరిపక్వమైనంత ప్రాపంచిక విషయసర్వస్వము సన్న్యసించి యుపనిషత్తులు చంకలోను హృదయము వైనము సంపును స్థిరముగనుంచి యరణ్యములందుఁ గ్రుమ్మరెను.

సనాతన ధర్మానుసారము హైందవజీవితము చతురా శ్రమ సమన్వితము. బ్రహ్మచారిగ నున్నపుడు మానవుఁడు గురు సేవా పూర్వకమైన విద్యా సముపార్జనమున నిమగ్నుఁడై యుండవలయును. పిమ్మట గృహస్థుఁడై పంచయజ్ఞ నిర్వహణ మొనర్చు చుండవలయును. వానప్రస్థమున భార్యా పుత్రాదులతో నరణ్యమునకేగి కేవల సాత్త్వికాహార నియమ నిష్ఠా కలితుఁడై జీవయాత్ర సాగించుచు భగవంతునిపై మనసు లగ్నము గావింపవలయును. సన్న్యాసాశ్రమమునఁ జేరునప్పటికి ఆత్మ పరిపక్వమై జీవిత పరమావధియగు పరిపూర్ణప్రజ్ఞను సాధింపవలయును.

ఈప్రకారము జీవితదశలను నిర్ణయించి నిర్వహించుట దుస్తరమని ప్రకృతము మానవులలోఁ గొంద ఱపోహఁ జెందుదురు. కాని రామతీర్థుఁడు తనజీవితమునఁ జతురాశ్రమ ధర్మములఁ గ్రమముదప్పక యనుష్ఠించినాఁడు. విద్యార్థిగనుండి గురు

చరణ సేవామకరందము గ్రోలుచు అకలంక బ్రహ్మచర్యము నెఱపెనాతఁడు. తాను కళాశాలయందు అధ్యాపకుఁడుగనుండి కుటుంబపోషణము స్వాయముగా నెఱపుకొనుచు గృహస్థధర్మముల నిర్వహించెను. వానప్రస్థధర్మ నిర్వహణమునకై భార్యాపుత్రులతో హిమవత్పర్వత ప్రాంతవనములకేగి యందు వసించెను. ఆప్రకారము మూఁడు నెలల కాలముండిన యనంతరము తన భార్యాపుత్రు లాకష్టముల కోరువలేమిని గ్రహించి వారిని లాహోరునకంపి యడవులలో సంచరించుచుఁ బందొమ్మిది వందల సంవత్సరమునఁ బరిపూర్ణ సన్న్యాసి యయ్యెను.

అతఁ డడవులకు బయలువెడలునపుడు లాహోరు స్టేషను కడకు విద్యార్థులు మిత్రులు నేతెంచిరి. ధూమశకటము నెక్కుతఱుణమున నతనిచే రచింపఁబడిన యొక గీతము అతని శిష్యులలో నగ్రేసరుఁడగు స్వామి నారాయణుఁడు సహజ మధురముగ గానము గావించెను.

"సెలవు, లెక్కలార; సెలవు, రావీనదీ;
సెలవు, బిడ్డలార; సెలవు, పత్ని;
మిత్రులార, సెలవు; శత్రులార, సెలవు;
సెలవు, చల్లగాలి; సెలవు, దీప్తి;

పుస్తకాళి, సెలవు; బోధనాళి, సెలవు;
గుణములార, లుప్త గుణములార,
సెలవు, సెలవు, మీకు సెలవింక హృదయమా,
సెలవు, పరమధామ; సెలవు రామ."

# హిమాలయవాసము

ఇటుపిమ్మట తీర్థరాముఁడు కళాశాల విద్యార్థిగాఁడు. అధ్యాపకుఁడును గాఁడు. భక్తి జనితానంద రసనిమగ్నుఁడై తన ప్రపితామహుఁడగు తులసీదాసునకుఁ బ్రత్యామ్నాయమగు మహాత్ముఁడు. రామతీర్థుఁడు తులసీదాసునివలెఁ గవితా దృష్టిగలవాఁడు మాత్రమేగాక యతఁడు తానుగాంచు ప్రతివస్తువునం దంతర్లీనునిగా రామచంద్రునిఁజూచినట్లే, తానును స్థిరబుద్ధియై తన యాత్మను విశ్వవ్యాప్తునిగాఁ బర్యాలోకింప సమర్థుఁడు.

రాముఁడు శ్రీశంకరునివలె ఏకైక సత్యపదార్థముపై దృష్టి నిగుడ్చెను. అంతియకాదు. ప్రాచీన మహర్షిసత్తముల విజ్ఞానమును చైతన్యాని సమాధినిష్ఠయు సమ్మేళనమంది మూర్తీభవించిన రవీంద్రునివలె నతఁడును కవీంద్రుఁడు.

1899 లో అతఁడు ఇరువది యాఱేండ్ల ప్రాయమువాఁడైనతఱి రాకొమరుఁడగు సిద్ధార్థునకుఁ దొల్లి కలిగిన వైరాగ్యము గలిగెను. హిమవన్నగమున కరిగెను. అచ్చట యాత్మోత్తేజక దృశ్యముల నప్పుడప్పుడేగి చూచుటతోఁ దనిసినవాఁడు కాఁడు. అతనితండ్రి యనేకపర్యాయములు ఇంటికిఁ దిరిగి రమ్మని యుత్తరములు వ్రాసెను. రాముఁడాతని వేడికోలును బెడచెవిఁ బెట్టెను. ధన్నరాముఁడు హీరానందుని కోరిక ననుసరించి రాముని గృహోన్ముఖుఁడవు గమ్మని కోరుచు లేఖ వ్రాసెను. రాముఁడా లేఖకు సమాధానముగ నీలేఖను వ్రాసెను.

"నేను దిరిగి వచ్చుటనుగూర్చి వ్రాయఁబడిన తమ దయాపూర్వక లేఖ అందినది. ఇప్పుడే దానిని గంగానదీ గర్భ

మునకుఁ బంపినాను. అదియే అది చేరఁదగినచోటు. కుటుంబ పక్షమున నాకేమి మీరు తెలిపినను మీదయ పూర్ణముగ నాయందున్నంత కాలము నాకు సుంతయైన త్వరగలుగదు. ఇఁక ఆలోచనకు మిగిలినది ప్రపంచము గేలిసేత, దూషణము. దానికి జవాబుగాఁ జెప్పదలఁచినదిది. నేను కృతనిశ్చయుఁడనై మేడిపై చేయివైచి కృషి కారంభించినాఁడను. ఇఁక నెవరు దూషించినను నాపైన నేరమారోపించినను నేను గణింపను.

నేను భవదాజ్ఞలను శిరసావహించు చున్నాఁడను. నేను ప్రభుగృహమువైపే నడచుచున్నాను. పాంచ భౌతిక శరీరము నాఁదగు సంచాపగను వీడినఁగాని వైకుంఠద్వారము అను హరి ద్వారమునకుఁ బోఁజాలము.

ఇపుడు సుమారు రాత్రి పదిగంటలు. మనుష్యుని జాడ గాని నీడగాని యిచట లేదు. గంగా తరంగిణీ తరంగనిస్వనము అంత ర్వాణీ మధురగీతాలాపము బాహ్యాభ్యంతరములఁ బరస్పర ప్రతి ధ్వనితములై ప్రవర్తిలు చున్నవి. ఆత్మ ప్రశాంతముగను బాహ్య ప్రకృతి యాహ్లాదజనకముగను నున్నది. నా పురోభాగమున నమృతధుని ప్రవహించుచున్నది. ఇట్టి తరుణమున సంసారమును గూర్చియుఁ బ్రపంచమునుగూర్చియుఁ దలపోయుటయా? అబ్బా! అత్యంత బాధాకరము ! !

హృద్వీధులలో నన్ను గలిసికొనుఁ డంటినని ఇంటియొద్ద వారికిఁ దెలుపుఁడు. ఒక్కసారియేని గలిసికొనిరా నన్ను వారినుండి యేదియు వేఱు చేయఁజాలదు.

ఆహా! ఆ యదృష్టము నా కెప్పుడు? భాగీరథీతీరమున - శరజ్జ్యోత్స్నా పులకితయామినిని - పిండి యారఁబోసినట్లుండిన

వెన్నెలరేయిని బిగ్గఱగ శివశివయను నామ ముచ్చరించుచు, హస్తాను రాగాశ్రుపూరితాక్షి యుగ్మకముతో హర్షవివశీకృత స్వాంతుఁడ నగుటెప్పుడో? అని యమృతత్వము నాశించి రాజ్యములను రాజులు వీడెదరు. స్వర్లోకవాసులు సైతము తమ మందిరములువీడి భాగీరథీ తీరమునకు వత్తురు. అట్టియెడ వాస్తవమగు నీ యానందమును వీడి మృగతృష్ణల వెన్నంటుటకు అంతటి దురదృష్టవంతుఁడనా?

సర్వేశ్వరుని చరణకమల మరంద పానము గావింపనిది మఱలవారి యొద్దకురాఁడని యింటియొద్దనున్న వారికిఁ దెలుపుఁడు.

మురళీవాలయందలి ప్రజలు మురళీధరుని కింకరులైన నాఁడే తీర్థరాముఁడు, పుణ్యక్షేత్రములకు శాంతి సౌందర్యప్రసాదకుఁడు, వారియొద్దకు రాఁగలడు. అచట వైరాగ్యభాగీరథి లేని యొక నిమేషమేని నిలువఁజాలఁడు.

వాడినపూలు తుదకు గంగాజలములఁ బడును. అటులైన సజీవకుసుమమగు నా శరీరము నేల సత్యజ్ఞానమను భాగీరథిలో వైవరాదు? నా రక్తమను నాజ్యమున జ్ఞానాగ్ని నెందులకుఁ బ్రజ్వలింపఁ జేయరాదు? తన్మూలమున నెందులకు మానవ యజ్ఞ ఫలముఁ బొందరాదు? దశదిశలకు సౌజన్య సారప్రభలఁ బ్రసరించు నీ ప్రదేశమును వీడి యెటకును వెడలఁజాలను.

శివదాత్మస్వరూపుఁడు,
రామతీర్థుఁడు.

ఇది సుదీర్ఘమైన లేఖ; అతఁడెట్టిశ్రమకైననోర్చి సత్యాత్మ సాక్షాత్కారమున కెంతగఁ బరితపించు చున్నాఁడో ఇది తెలుపఁ

గలడు. అతఁడుపన్యాస నిమిత్తమాత్రమగు వేదాంతముతో సంతృప్తుఁడు కాఁడు. ఆత్మ సాక్షాత్కారమునకు జీవిత సర్వ స్వము త్యాగముగావింప సంసిద్ధుఁడు. ఒకనాఁడు తీర్థరాముఁడీ క్రింది భావప్రకటనము చేసినాఁడు.

“ ఏకాంతమున నున్నాఁడనా? ఔను, ఏకాంతముగనే యున్నాఁడను: భూమిపై నను సముద్రగర్భమునందును – నేనే భూమిని – నేనే నీ రమను.

నాయొద్ద విద్యార్థిగాని తుదకొక భృత్యుఁడుగాని లేఁడు. పట్టణము చాలదూరమున నున్నది. మానవుని పేరు కర్పూరము వలెఁ గరఁగి యదృశ్యమైపోయినది. నలుగెలంకుల నడవియున్నది. పరిపూర్ణ నిశ్శబ్దము నున్నది. చుక్కలు వెలుఁగుచున్న రాత్రి యిది. ఏమి, నేను ఒకఁడనై యున్నాఁడనా ?

నాచుట్టు మారుతము నిస్వనించుచున్నది. చెట్లు ‘ఇక్కడ నున్నామండీ’ యని పలుకుచున్నవి. అది సింహ శార్దూల గర్జనము కావచ్చును. ఈ పొదలలో నా భృత్యు లెందఱో వందల కొలఁది కలరు. వారందఱు ముఖద్వారమున నఱచుచున్నారు.

మానస సరోవరము పరిపూర్ణముగ నున్నది. అచటి నుండి యానందలహరి ప్రవహించు చున్నది. ప్రతిరోమము అమృతమయమైనది. సర్వవ్యాపకుని హృదయమునుండి యే కూలంకష స్రోత కల్లోలినియై యమృతము ప్రవహించు చున్నది. ఆతని కృపాతరంగిణియే నాపాద సమీపమునఁ బ్రవహించు భాగీరథి. మానవకోటికి శాంతి సంతోషములఁ బ్రసాదించు చున్నదియు నేను. అట్టివాఁడా సోమరిగ నున్నది? నేను నిశ్చయ

ముగఁ జెప్పఁగలను. వానిని దర్శించినంతనే నీవు రక్షితుఁడవు కాఁగలవు. అతఁడే అమరస్రవంతి. సాక్షాత్కరించు వాఁడా తఁడు, అతఁడే శ్రీరాముఁడు.

ఆహా! నేనెంత యందముగ నున్నాఁడను? నారూప మెంత మనోహరము? నాశరీర మెంత సౌందర్య సమన్వితము! నన్ను జూచునంతనే ప్రతివ్యక్తియు నిశ్చేష్టితుఁడై పోగలఁడు. ఓ నాయాకార సౌందర్య ప్రకాశములారా! మిమ్ములఁ జూడఁ జాలినవి నానేత్రములే కాని యన్యములు కాఁజాలవు."

హిమాలయములందు వసించిన యప్పుడు సర్వ సాధారణముగ నతఁడిట్టి యుజ్జ్వల భావ ప్రకటనముల సలుపుచుండు వాఁడు. ప్రకృతి సౌందర్యోపాసనమున నాత్మ స్వాతంత్ర్య సౌఖ్యానందముల నట్టివి వెలువడు చుండును. సామాన్యులే యాదృశ్యముల నవలోకించిన నమృతధామము గాంచెదరు. అట్టి యెడఁ గవియగు నతనియాత్మ హిమవచ్ఛృంగములఁ జూచుటచే నుజ్జ్వలితమయ్యెనన నాశ్చర్యమేమి? హరిద్వారమునకుఁ గొంచె మవల గంగానదీ తీరమునఁ దనయాత్మ పరమావధిని సాధించుకొనుట లేదా? అతఁడు గంగా పవిత్ర జలగర్భమునఁ గలియుట యను మృత్యు నిర్భీకదృఢసంకల్పముతో స్థిరుఁడై కూరుచుండెను.

అతఁడా విషయమును వ్రాసినాఁడిట్టులు: "నేను భాగీరథీతీరమున నుపవిష్టుఁడనై యుంటిని. నాచుట్టుప్రక్కల సాంద్రారణ్యము గలదు. వసంతలక్ష్మి ప్రసూన సౌరభములతో సుస్మితవదనయై సాక్షాత్కరించెను. ఉపనిషత్తులు స్వకార్యము నిర్వహించినవి. తుదకు అమృత ప్రవాహినినై బ్రహ్మానందము వశమయ్యెను. ఆయానందానుభూతిని వర్ణింప నాశక్తి సామ

ర్థ్యములు చాలవు. ఓహో! ఏమి యమేయసంతుష్టి! ఇంత దనుక అజ్ఞానాంధకారమునఁబడి యుంటఁజేసి నా ప్రభుని రూప మును సరిగాఁ గాంచ నైతిని. నేఁడు నాప్రభునియందు విలీనుఁడ నైతిని. ఓహృదయమా! నాకును నాప్రభువునకును మధ్య నీవు నిలువకుము. నాయాత్మను హీడుము. ప్రభునితో నద్వైత రసానుభూతిని గాంచనిమ్ము. తొలఁగుము. తొలఁగుము. నేనే నా ప్రభుఁడను. నాప్రభుఁడే నేను. ఆహా! ఈ మధురభావ మెంత యాహ్లాదజనకము. ఆనంద రసము చక్షుస్స్యందియై చెక్కుటద్దములపైఁ బడుచున్నది.

అంధకారము వెలుఁగుముందెటులు నిలువఁజాలక తొలఁ గునో అదే ప్రకారము ఇప్పుడు నిర్ధనత్వ నిస్పృహాయతలు తొలఁగి నవి. పాపపుణ్య విభేదము లంతరించినవి. ఓశీర్షమ, నేఁడు నీయునికి సార్థకమైనది. కన్నులారా! నేఁడెంత సౌఖ్య సంధాయకములు మీరు! కర్ణములారా! మీరెంత ఆనంద సంధాయకములు? సౌఖ్యానందములను పదములు సైతము నేఁడెంత సౌఖ్యానంద ములకు ఆకరములైనవి ! ! "

ఓమ్ ఓమ్ ఓమ్.

తీర్థరామునకు అనుయాయులు కొలఁదిమంది. దుస్తులు- ఒక దుప్పటి, ఒక యంగవస్త్రము. పాదరక్షలా లేవు. తల పాగాయు లేదు. నడచుచున్నది మంచుగడ్డలపైన. రామతీర్థుఁడు మహా రిసక్తముడై యీప్రకారము శృంగమునుండి శృంగ మునకుఁ బయనించెను. అమరనాథ, కేదారనాథ, జన్మోత్రి, గంగోత్రి - ఆయా పవిత్ర ప్రదేశములందును పుణ్యనదులందును విలీనుఁడగు చుండెను. చక్రవర్తి యఖండ సామ్రాజ్య పర్య

వేష్టా కుతూహలియై నిరాతంకముగ సంచారముసేయు తెఱంగున నితఁడు నాగిరిశిఖరములపై నడయాడుచుండఁ జూడనోచిన ధన్యాత్ములు అమరలోకమునుండి యవతరించిన యే దివ్యుఁడోయని యాశ్చర్యమగ్న మానసులగు చుండిరి. విద్యాలయము వీడి వచ్చినపుడు అస్థిపంజరము వలెనున్న యతఁడెంతలో నెంత మాఱుపునందెను! అతని యాత్మసౌందర్యమే బాహ్యశరీరమున రూపుగాంచెనేమో!

ఎండ, గాలి, వాన ఇవి యతని రూపమును ద్విగుణీకృతము గావింప నుపకరించినవి. పులులు మొదలగు క్రూర మృగములు అనురాగార్ద్రములగు నతని గంభీర దృక్కులకు లోఁగి గొఱ్ఱెపిల్లలవలె నగుచుండెను. మృత్యువు భయము నను నవి తలంపునఁ జొరనీక పాలు, పండ్లు భక్షించుచుఁ దన యాశ్రమమున జీవిత సత్యధ్యానమగ్నుఁడై కాలము గడపుచుండెను. అరగంటకుఁ బైఁగాఁ దన కన్నములోనికిఁ బోవుటకుఁ గాలము దీసికొనునంత పొడవు పాటిదగు నొక గొప్ప కొండచిలువ యతని కుటీరమునకు సమీపముగఁ గలదు. దానిని జూచినపుడు రాముఁ డేమాత్రము చలింపలేదు. చిన్ననాఁడు పెట్టెలోఁ బామును జూచి భయమంది పరువులిడిన బాలరాముఁడేనా యీతఁడు? లేక మఱొక వ్యక్తియా? అతని శాంత శివసుందరస్వరూప సుధ యతనినుండి వెల్లువయై నలుగెలంకులకుఁ బ్రవహించు చుండెను. అతఁ డనుభూతినందు శాంతి సౌందర్యములు ప్రతి వస్తువునందును బ్రతిబింబితములైనవి. సుందరశిఖరముల నాతఁ డిట్లు దివ్యగానము గావించెను:

" నాదు దెసఁగాంచి ప్రవహించు నదివిధాన;
శాంతి ప్రవహించు దివ్యస్రవంతి భంగి;
శాంతి నాలోన నుప్పొంగు సంద్రమటులు;
అది శిఖానఖ పర్యాప్తయగుచుఁ బాఱు.

అది యుత్తుంగతరంగ నిస్వనితమై యావిర్భవించున్ మదీ
య దయాపాంగ విలోకనక్రియల రోమాంచంబులన్ సర్వదా
యెది కళ్యాణ పవిత్ర వస్త్రయుగళం బిండోయి వేవేగ, శ
ర్మద శుభ్రాంశు సమప్రభాసితము హేమప్రాభవోపేతమున్.

కనుఁ డభ్యంతర యవనిక
జనతా సర్వస్వమునకు సౌలభ్యముగాఁ
దునియలు గావింపఁ బడియెఁ
గనుఁ డభ్యంతర యవనిక కనుఁడదె తొలఁగెన్.

ఏమి మహాద్భుత చక్రము,
ఏమి విచిత్ర ప్రకాశవృత్తము! అరరే!!
ఓ మధురజీవసుధ, యో
హో, మధువాత్మయును దేహ ముజ్జ్వలితములా!

రండు, మీన చయము; రండు, శ్వాన చయము;
రండు, ప్రేమబంధురప్రజాళి;
రండు, ప్రకృతిశక్తి రాజితుల్ పశుపక్షి
జంతు సంతతులు ప్రశాంతమతులు;
పరిణయంపు విందుఁ బాల్గొనవే రండు,
ప్రేమమీఱఁ దారివ వేగ రండు,
రండు, రండు, నాదు రక్తమ్ము, మాంసమ్ము
భక్షణమ్ముసేయ బంధుజనము.

నర్తింతు నర్తింతు నవనవానందమ్మున,
　　నను నంద నానందమమునను నేను;
చుక్కగములలోన సూర్యపరిధులలోన
　　నర్తించు ననఘగర్భమున నేను;
వాగ్విల్లోకల – జలనమాలికలందు
　　నర్తించెను సమీరణమున నేను;
మధురాతిమధుర సమ్మద సుస్వాన్నన
　　వీచీ పరంపరావృతుఁడ నేను;
కీర్తింతుఁ గీర్తింతు గీతామధురవాణి
　　కలనిస్వనముల మురళిని నేను;
ఏ దిదృక్షువును, మఱేను దృశ్యంబును,
　　కర్త నేను, నేన కర్మచయము,
తరగ లాత్మలోనఁ జెరిగిన కొలఁదిని
　　దగ జగత్తు బుద్బుదంబ యగును."

## జపాను యాత్ర

1893 లో షికాగో నగరమున జరిగిన విశ్వమత మహాసభ వివేకానందాదులఁ బ్రాచ్య మహామహుల నెందఱినో లోకమున సుప్రతిష్ఠితులఁ గావించెను. వివేకానందుని యఖండ విజయము తత్త్వవేత్తలకొక యుత్సాహ కారణమయ్యెను. అట్టి సభ యెచ్చట నెవ రేర్పాటు గావింతురోయని యెల్లరు నువ్విళ్ళూరుచుండిరి. టోకియోనగరమున జరుగఁగలదని యొకవార్త ప్రాచుర్యమునకు వచ్చెను.

రామతీర్థుఁ డీ తరుణమున హిమవచ్ఛృంగముల నధిగమించుచు, నదీప్రవాహముల నీదుచు, గుహలలో భయంకర మృగములతో సాహచర్య సౌభాగ్యము ననుభవించుచుఁ, జింతా భయభ్రాంతులకు దూరుఁడై యాత్మ సాక్షాత్కారమునంది యవ్యయానందమునఁ దేలియాడుచు నెడనెడ ఆగ్రా లక్నో మున్నగు మహానగరముల కేగుచు సందర్భోచితోపన్యాసము లొసఁగుచు నద్భుత వక్తయై యఖిలజన సమూహముల హృదయములఁ జూఱఁగొనుచుండెను.

అతఁడొకపరి భారత ధర్మ మహామండల సభకధ్యక్షుఁడు. అతని యధ్యక్షోపన్యాసము వినుటకే యాసభకు శత సహస్రాధికముగ జనులు వివిధ ప్రాంతములనుండి విచ్చేసిరి. అతని యమేయ వక్తృత్వమునకు నఖండ పాండిత్యమునకు నాత్మజ్ఞాన సిద్ధికి వివశుఁడై టెహ్రీ మహారాజతని చరణములే శరణములని తలఁచి యతనికి శిష్యుఁడయ్యెను.

టోకియోలో జరుగనున్న సభా వృత్తాంతము టెహ్రీ మహారాజున కెట్టులో తెలియవచ్చెను. వివేకానందు డట్లు తన యాచార్యుఁడును 'భారతీయ మతసంస్కృతి మహత్త్వమునకు విశాల విశ్వమున విపుల విజయ విఖ్యాతులఁ గూర్పఁగలఁడని యాశించెను. వెంటనే రామతీర్థుని సమీపించి విశ్వమత మహాసభకు భారతప్రతినిధిగఁ బోఁగలందులకుఁ బ్రార్థించెను. ప్రార్థించుటయే తడవుగ నాసంప్రార్థనము సంతోషపూర్వకముగ నతఁ డంగీకరించెను.

సభాకార్యక్రమ వివరములఁ బట్టి వెంటనే బయలుదేరినఁ దప్ప సభలోఁ బాల్గొను నవకాశముండదు. రామతీర్థుఁడు

వారముదినములలోఁ ప్రయాణ సన్నాహము చేవో పూర్తి గావించుకొని నారాయణ ద్వితీయుఁడై 1902 ఆగష్టు 28-వ తేదీనాఁడు కలకత్తాలో నావ నెక్కినాఁడు. అందు స్వామితీర్థుని వర్తక సమాజము లక్షీభక్తిఁ బూజించినవి. మార్గమధ్యమున హాంకాంగులో సిక్కు గురుద్వారమున గురుభక్తినిగూర్చి స్వామి యుపన్యసించెను. జపాను మొదటి రేవగు నాగసాకీలో దిగి జపానీయుల జీవిత విధానములఁగాంచి యతఁడానందించి, "రాముఁడీ ప్రజానీకమునకు బోధింపవలసిన దేదియు లేదు. వీరె ల్లరు వేదాంతులు. వీరెల్లరు రాములు. ఎంతటి యుత్సాహ వంతులు, ఎంతటి సుఖానుభవులు, ఎంతటి శాంతిప్రియులు, ఎంతటి కష్టజీవులు! ఈవిధానమునే రాముఁడు జీవితమనును." అని యుద్ఘాటించెను. యోకహామాలో వాస్యామల్ అసోమల్ కంపెనీవారి యాతిథ్యము స్వీకరించి వారి ప్రతినిధుల వెంటనిడు కొని టోకియోనగరమున ఇండో-జపానీజ్ క్లబ్బును చేరెను. ఆ క్లబ్బునకుఁ గార్యదర్శి పురాణసింగను నొక భారతీయ యువ జనుఁడు, అమితోత్సాహశీలుఁడు.

యోకహామానుండి వెంటనచ్చినవారు భారతీయ స్వామి శేఖరులను క్లబ్బు యజమానులకు, బరిచయము గావించు టయే తడవు, రామ నారాయణు లిరువురు ఓంకారనినాదము గావించుచు నాభవనమున నడుగిడిరి. ఆప్రణవ నినాదమచట సభ్యులనెల్లఁ బరవశులఁ గావించెను. కార్యదర్శియగు పురాణ సింహుఁడు అనిర్వాచనీ యానందమునఁ దేలుచుండెను. సభ్యు లెల్లరు కరములుమోడ్చి స్వాములయెదుట నిల్చిరి.

పురాణసింహునకు రామునితోడి పరిచయము పరమాశ్చర్యకర సంఘటనము. స్వామి నారాయణుఁడు పురాణునిగని "మీదే దేశము?" అని ప్రశ్నించెను. అతఁడు "ప్రపంచమే నా దేశము" అని ప్రత్యుత్తరించెను. ఆవాక్యము నందుకొని రాముఁ డిట్లనెను. "మేలొనర్చుటే నా మతము" ఈ యిరువురికి వాక్యసామ్యమే హృదయముల దగ్గఱకుఁ దెచ్చెను.

పురాణసింహుఁ డానాఁడు బౌద్ధవిశ్వవిద్యాలయమున నొక మహాసభలో నుపన్యసింప వలసియుండెను. అతఁడు స్వామిని వెంటఁగొని యాసభలోనుపన్యసింపఁ గోరెను. స్వామి యందుల కెట్టి యభ్యంతరము చెప్పక యతనివెంట బయలుదేరెను. వారు ట్రాముబండిలోఁ బయనించిరి. పురాణసింహుఁ డుపన్యాసమున కెట్టియత్నముసేయక మధురమగు ప్రణవ నినాదము గావించుచుఁ దా నెచ్చటనున్నదియుఁ దెలియని తన్మయస్థితిలో ట్రాము ప్రయాణమును ముగించెను. రామ పురాణులు గమ్యస్థానము సేరిరి. సభలోఁ బురాణుఁ డుపన్యసింపఁ దొడఁగెను; సభ్యులతనిలో నపూర్వ వాగ్విజృంభణముగాంచి విస్మితులైరి. దీనికిఁ గత మతఁడు చెప్పినది రాముని పరిచయభాగ్యమున నలవడిన యోంకారప్రభావమే. పిమ్మట రామతీర్థుఁ డుపన్యసించెను. మెఱపులు మెఱసెను. పూలజల్లులు గురిసెను. జను లద్వైతామృత పూరమునఁ దనిసిరి. ఆ సభలో నాస్ట్రేలియానుండివచ్చిన బౌద్ధపండితులు పలువు రుండిరి.

వారు బసకుఁ దిరిగివచ్చినపుడు రాముఁడు పురాణునిగని యిట్లనియెను: ' నాకుఁ గావలసినది నీవంటివాఁడే. టోకియో వీధులలో జనసమూహపు టలజడిలోఁ బ్రశాంతముగ దన యుప

న్యాసాంశముల మననము చేయఁగలవాఁడే. ఇదియే జీవితరహస్యము. ఇదియే మనఃకేంద్రీకరణము. ఇదియే యోగము.”

మఱునాఁడు పురాణుఁడు 1893 లో జరిగిన విశ్వమత మహాసభా కార్యకలాపములఁ దెలుపు బృహద్గ్రంథముల రెండింటిఁ దెచ్చి రామున కొసఁగెను. రామతీర్థుఁడు వానినిజూచి యాశ్చర్యముతో, “ఈ గ్రంథములే నేను గోరఁదలఁచినది. నే నడుగక పూర్వమే వీని నెట్లు తెచ్చితివి? ప్రకృతియే రామునకు వలసిన వన్నియుఁ దనంతట దానే సమకూర్చును.” అని పలికెను. అంతట వారిరువురును విశ్వమత మహాసభనుగూర్చి యధిక కాలము భాషించిరి. టోకియోలో నట్టిసభ నేర్పాటు లేదని తెలిసికొని రాముఁడు పకపక నవ్వి, “హిమాలయములలో ముక్కుమూసికొని కాలక్షేపము సేయుచున్న యీ రాముని ప్రకృతి యెంత విచిత్రముగ ప్రపంచములోనికిఁ దెచ్చినది! రాముఁడే విశ్వమత మహాసభ; టోకియో విశ్వమత మహాసభ నేర్పాటుగావింపనిచో రాముఁడే దాని నేర్పాటు చేయఁగలఁడు.” అని పలికెను.

పురాణుఁ డొకపర్యాయము టోకియోలోని నాయిబో కాండో అనునొక భూస్వామి గృహమునకు రాముని గొంపోయెను. ఆ భూస్వామి స్వామిరామునితో సంభాషించుచు లేచి యింటిలోనికిఁ బోయి భార్యాపుత్త్రులఁ బిల్చుకొనివచ్చి, “క్షమింపుఁడు, ఈ యసాధారణానందమును నా నాలుబిడ్డలకుఁ బాలీయక స్వార్థపరుఁడనై నే నొక్కఁడ ననుభవింపఁ జాలను” అని పలికి, “స్వామీ, మీ రేల కుటుంబమును సన్న్యసించితిరి?”, అని ప్రశ్నించెను. “జగత్కుటుంబము కొఱకు; జగత్తుతో నానందమునఁ బాల్గొనుటకు”; అని స్వామి తల్లజుని తత్క్షణసమాధానము.

ఒకనాఁడు పూనా వాస్తవ్యుఁ డొకఁడు టోకియోలో సర్కసు ప్రదర్శనము లద్భుతముగాఁ జేయుటవిని భారతీయ విద్యార్థులు పలువురది గనఁ గుతూహలురై బయలుదేరిరి. ఆ ప్రదర్శనమునకు పురాణుఁడును వెడలెను. రాముఁ డతనివెంట నుండెను. పురాతన వాఙ్మయ పరిశీలకుఁడు సంస్కృతపండితుఁడు నగు టాకాకుస్సు మహాశయుఁడు రామతీర్థునితో సంభాషించెను. సంభాషణానంతరము ఆపండితుఁడు, "నేను మాక్సుముల్లరుకడ విద్వాంసులను వేదాంతులను అనేకులఁ గాంచితిని. నే నెన్నండును రామతీర్థస్వామిని బోలిన మహాపురుషుని గనలేదు. అతఁడు తాఁ జెప్పు వేదాంతమునకు రూపము" అని పలికెను.

సర్కసనంతరము బసకు వెడలునపుడు వారికి బండి తటస్థింపలేదు. పాదచారులై యింటికిఁబోవ నిశ్చయించుకొనిరి. స్వామి రాముఁడు చకచక నడువసాఁగెను. అతని ననుగమింప యత్నించిరికాని యెవ్వఁడును కృతార్థుఁడు కాలేదు. అతఁడాత్మ రూపుఁడు. ఆత్మయట్టు లతఁడు శీఘ్రగామియని వారెల్ల రతనిని కొనియాడిరి.

ప్రతి సాయంసమయమునను ప్రజ లతనికడకు గుంపులు గుంపులుగా వచ్చుచుండిరి. వా రతఁ డొనర్చు ప్రబోధోపన్యాసముల నత్యంతము శ్రద్ధాళువులై వినుచుండిరి. పురాణునితో - ఆ సమయమునందుఁ గనులు మూసికొని ఓంకార ధ్యానము గావించుచు స్వామిచెప్పు విషయముల గమనింపకయే యుండును. కాని రాముని భావములన్నియు నతనిలోఁ బ్రవేశించినవి. అతఁడు క్రమముగా రామునికి అవనతుఁడై శిష్యుఁడై సన్న్యసించెను. అతఁడును రామునిస్థితికివచ్చి కొంతకాలమునకు లోకోద్ధరణ పర

తంత్రుఁడు గాఁజాలెను. సహజమేగదా ఒక జ్యోతి యనేక జ్యోతుల వెలిగింపఁ గలుగుట !

రామతీర్థుఁడు 'విజయ రహస్యము' అను విషయముపై టోకియోనగరమున నొక మహోపన్యాసము గావించెను.

సర్కసు కంపెనీవారమెరికాకుఁ బోవు నోడలో రామ తీర్థుఁడు శాన్‌ఫ్రాన్సిస్కో నగరమున కచటినుండి పోయెను.

'విజయ రహస్యము'అను నుపన్యాసము పత్త్రికలలోఁ బ్రచురింపఁబడెను. ఆ యమూల్య సందేశమును బఠించిన రషియా రాయబారి యొకఁడు రాముని సందర్శింప నుత్సుకుఁడై టోకియో నగరమునకు వచ్చెను. రాముఁడప్పటికే యమెరికా చేరెను.

రామతీర్థస్వామి జపానును వీడినసిమ్మట కె. హీరాయి యను నొక జపానీయుఁ డిట్లనియెను: "అవె యతని చిఱు నవ్వులు (రేగు) పూలువోలెగాలిలో నెగురుచున్నవి." టోకియోలో 'విజయ రహస్యము'ను విన్న యొక చిత్రకారుఁ డాంగ్లము రానివాఁడు "నాకుఁ జూడ నతఁడొక యగ్నిజ్వాల యనియు నతనిపలుకు లగ్నికణములనియుఁ దోఁచును" అని పలికెను.

## అమెరికా యాత్ర

స్వామి తల్లజుఁడు రామతీర్థుఁడు శిష్యుని నారాయణుని ప్రాచ్యఖండ దేశములలోఁ బ్రచారము గావింప నియోగించి తాను సర్కసుకంపెనీవారి యోడలో నమెరికా ఖండమునకుఁ బయనమయ్యెను. ఇట నారాయణుఁడు గుర్వాజ్ఞను శిరసావ

హాంచి, జపాను, బర్మా మొదలగు దేశములలో గురు సందేశమును వ్యాపింపఁ జేయుచుండెను.

రామతీర్థుఁ డెక్కిన యోడ మహార్ణవము నధిగమించుచుండ నతని హృదయ మానంద రసార్ణవమునఁ దేలియాడుచుండెను. ఎట్టకేలకు ఆయోడ అమెరికా తీరము చేరెను. ఓడలోనివాళ్లు తమతమ సామానులు సర్దుకొనుచుఁ బిల్లలు - మేకలను జూచుకొనుచు నూపిరిసలుపుటకేని తీరిక లేనివారై దిగి తమతమ గమ్యస్థానములఁ జేరఁ దొందరపడుచుండిరి. రామతీర్థుని ముఖమున ముగ్ధగములనేలు తేజఃపుంజము మూర్తీభవింపఁ జాలునవ్వు మొలకలు చిందులాడ అంతఃప్రశాంతి సంతోషములకు సూచకముగ నావ పై భాగమునఁ గూర్చుండినచోటఁ గూర్చుండక మాటిమాటికి స్థలమును మార్చుచు వినోదించుచుండెను. ఇదియంతయు గమనించి యచ్చెరువందిన యొక యమెరికా దేశీయుఁ డతని సమీపింప నయ్యెరువురకు నీ క్రింది సంభాషణము జరిగెను.

"అయ్యా, మీ సామానెక్కడ?"

"నేను ధరించిన యుడుపులుదక్క నాకెట్టి సామానులు లేవు."

"నీవు నీ ధనమెచ్చట దాచుకొందువు?

"నేనే ధనమును నాకడ నుంచుకొనను."

"ఐన జీవన మెట్లు?"

"ప్రేమయే నాకు జీవనమార్గము. నేను దప్పిగొన్న యెడల నాకు మంచినీర మెవ్వఁడో యొకఁడు తెచ్చియిచ్చును.

ఆఁకొంటినా, ఎవరో యొకరు రొట్టె తెచ్చి యిత్తురు."

"అయిన నీ కమెరికాలో మిత్రు లుండియుందురు."

"ఔను ఉన్నారు. ప్రస్తుతము నాకిప్పుడొక యమెరికా వాసి మిత్రుఁ డున్నాఁడు. ఎవరంటివా యతఁడు నీవే."

రాముఁ డీ తుదివాక్యము నుచ్చరించుచు నమెరికా దేశీయుని భుజమునుఁ బ్రేమపూర్వకముగ స్పృశించెను. ఈ 'నీవే' యను పద మద్భుత విద్యుచ్ఛక్తివలెఁ బనిచేసెను. రాముని కరస్పర్శ యతని హృదయమును బులకింపఁ జేసెను. నాఁడు మొదలతఁడు రామునకు మార్గదర్శకుఁడై యమెరికా ఖండమున ననేక విధములఁ దోడ్పడెను. ఈతఁడు రామునిగూర్చి యిట్లు వ్రాసెను:

"హిమాలయములనుండి క్రిందికి దిగివచ్చిన జ్ఞానజ్యోతి యతఁడు. అతని నగ్ని దహింపఁ జాలదు; శస్త్రములు ఛేదింపఁ జాలవు. ఆనందాశ్రువు లనవరత మతని నేత్రాంచలములఁ జాలువాఱును. అతని దర్శనము నవజీవన ప్రభాతము."

ఆత్మస్వరూపుఁడు రామతీర్థుఁడని వేఱుగఁ దెలుపవలెనా? రామతీర్థుఁడు డాక్టరు హిల్లరు గృహమున కతిథి యయ్యెను. అతఁడు శాస్తాస్ప్రింగ్సుకడ నధివసించుచుఁ గాయకష్టము సేయు సామాన్య కార్మికునివలెఁ బర్వతములపైకిఁ బోయి యచటి చెట్లనఱికి వంటచెఱుకును సేకరించి బుజములపై నిడికొని తెచ్చుచు నా కుటుంబమున కొకింత దోడ్పడుచుండెను. నిజమునకీ సాయమా దంపతులు కోరినదికాదు. లీలాప్రియుఁడైన గోపాలుని చందమున నితఁడును వినోదమున కాత్మ సంతృప్తికిఁ దలపెట్టిన

పనిని మానుష నెవనికి సాధ్యమగును? అమెరికావంటి యన్య దేశమునఁ గాయకష్టము సేయక హాయిగ నాతిథేయుల యింట నాదరింపులు ముప్పొద్దులు గావించుచు బొజ్జ నిమురుకొనుచుఁ గూర్చుండుట నాకు సమ్మతము కాదు." అని రాముఁడు తెలిపెను. మహనీయు లెప్పుడును తమ నడవడి యొరులకుఁ ద్రోవచూపు నదిగ నుండుటకే చూతురుగదా!

రాముఁడు బాల్యమునుండి యేకాంతవాసానురక్తుఁడు. ప్రకృతి ప్రియుఁడు. అమెరికాఖండము నందును నతఁ డెప్పుడు నేకాంతమునఁ బ్రకృతిదృశ్యము లవలోకించుచు మనఁగోరి పర్వత శిఖరముల నధిరోహించుచుండెను. శాస్తాపర్వతమునధిరోహించిన వారలలో నతఁడే మొదటివాఁడు. ఈ విషయమున నితనితోఁ గొంద ఱమెరికనులు పోటీచేసి యోడిరి. వారెల్ల రాతనిపై నీసు గొనలేదు సరికదా అతనిని ప్రథమ బహుమానము గైకొనఁ గోరిరి. అట్టి దేదియు దనకువలదని యతఁడు నిరాకరించెను. ఇచటనే ముప్పదిమైళ్ళ పందెపుఁ బరుగున గెలుపొందెను.

రాముఁడు శాస్తానది యొడ్డునఁ గూర్చుండి పక్షుల కిల కిలారవములతో నేకీభవించుచు గానము సేయుచు నానంద తన్మయుఁడై చరించుచు, "ఈ యానందము సంయుక్త రాష్ట్రముల యధ్యక్షునకును లేదు" అని నుడువుచుండెను. ఇట్లు ప్రకృతిమధ్యమున నానందించుచు నడుమనడుమ నీ పర్వతారణ్యముల వీడి వేదాంతోపన్యాసములీయ దేశములోనికి వచ్చుచుండెను. అతని రాక కమెరికను పత్రికలన్నియుఁ దమ సంతోషమును వెలిపుచ్చి, యతనిమహనీయ భావప్రకాశమునకు నంజలు లొసఁగుచుండెను. అతఁ డిట్టు లొక యుపన్యాసమునఁ దెలిపెను: "అమెరికా దేశీ

యులారా! సూర్యచంద్రులు మున్నుగఁ బ్రాక్సీమ నుదయించి పిమ్మటఁ గ్రమముగాఁ బశ్చిమదిగ్భాగమున నస్తమించుచున్నారు. వీర లిరువురును జగమునకు వెలుగిచ్చువారు. ఆత్మప్రకాశము సైతము తూరుపునుండియే మీకు రావలయును జుఁడీ! " ఇది యెంతయు సముచితము.

రాముఁడు భారతీయుల పక్షమున నమెరికనుల కొక విజ్ఞప్తిఁ గావించెను. అద్దానిని అమెరికనులు దత్తావధానులై యాలకించి కార్యోన్ముఖులైరి.

డాక్టరు హిల్లరు దంపతులు వృద్ధులగుటచే వారితోనొకింత సయ్యాటలాడుచు వారిని సంతుష్టాంతరంగులఁగావించుచుండెను. వార లాతనియెడఁ గడు మక్కువగలవారై యాతఁ డెల్లపుడును దమకడనే యుండిన బాగుండునని తలంచిరి.

రాముని వేదాంతధోరణి యమెరికాలోఁ బ్రఖ్యాతిఁ గాంచెను. అతనినిగూర్చి పత్రికలు ప్రశంసించుచుండెను. సామాన్యప్రజ లతని సమీపించి తమ కష్టనిష్ఠురములు దెలుపుకోఁ దొడఁగిరి. అతఁడును తన వేదాంతబోధనము మూలముననే వారికిదుఃఖోప శమన మార్గమును జూపుచుండెను.

ఒకనాఁ డొకస్త్రీ యతనికడకు వచ్చెను. ఆమె యాగర్భ శ్రీమంతురాలు. తన యావదాస్తిని ధనమును భూములను గృహ ములను రామతీర్థునకు సమర్పించి సన్న్యాసమును స్వీకరించెను. అతనికివి యేల? వాని నాతఁడు గైకొనక యామెకుఁ దత్త్వము నుపదేశించి యామె పావన చరితకుఁ జిన్నెగా నామెకు 'గంగ' యని పేరిడెను.

ఒకనాఁడొక యమెరికనునటి రాముని ప్రత్యేకముగ దర్శింప ననుజ్ఞ వేడినది. అతఁ డామెకు దర్శనము ననుమతించెను. ఆమె రత్నాభరణ భూషితయై యతనికడకు వచ్చెను. ఆతని పాదములపైఁబడి, "నా యాభరణములను నా చిఱునవ్వును జూడకుము. ఇవి బాహ్యానందమును సూచించునేగాని యంత రాందోళనమును దెలుపవు. నా కాత్మానందము చేకూర్పుఁ" డని ప్రార్థించెను. అతఁ డామెను బుజ్జగించి జ్ఞానోపదేశమున సంతఃప్రశాంతి గూర్చి పంపెను. పశ్చాత్తప్త పాశ్చాత్య నాగరికతా స్వరూపమే యామెయని యతని మనసున కనిపించెను.

మఱొక యువతి యతనికడకు వచ్చెను. పాప మామె బిడ్డచనిపోయెను. తనకు సౌఖ్యమును ప్రసాదింపుమని యామె వేడు కొనెను. స్వామి యిట్లు చెప్పెను: " రాముఁడు సౌఖ్యమును విక్రయించును." ఆమె "ధరయేమైననుసరియే నాకు సౌఖ్యము గావలయును స్వామీజీ" యనెను. "సౌఖ్యరాజ్యమునఁ జెలామణియగు నాణెములు వేఱు." అని స్వామి తెలుప నామె " సంసిద్ధను " అనెను. అపుడు స్వామి నీగ్రోబాలు నొకనిజూపి, " నీ బిడ్డగ వానిని భావించి పెంచుకొనుము" అని నుడువ నామె యట్లొనర్చి సౌఖ్యసంపాదన మొనర్చెను.

ఒక యమెరికను వృద్ధవనిత రాముని దర్శించి యతనికిఁ దన దుఃఖోదంతము గంటలకొలఁదిఁ జెప్పుచు నేడువఁ దొడఁ గెను. అతఁడు పద్మాసనస్థుఁడై కనులు మూసికొని కూర్చుం డెను. ఒకస్త్రీ యట్లు వాపోవుచుండ జాలిమాట గాని తుదకు, జూపుగాని లేకుండు టొక యనాగరిక లక్షణముగ భావించిఁ విగ్రహముపోలె నిశ్చలముగఁ గూర్చున్న స్వామినిజూచి " ఈ

భారతీయు లింతే; నిర్దయులు; అహంభావులు", అని వెడలఁ బోయెను. ఆస్త్రీ దుఃఖోదంతము పూర్తిగావించుట విని యతఁడు 'తల్లీ'యని సంబోధించి, ఓంకారనాద మవిచ్ఛిన్నముగఁ గావింపఁ దొడఁగెను. అతని కనులనుండి కరుణ కురియఁ జొచ్చెను. 'తల్లీ' యను సంబోధనము వినుటతోడనే యామెకుఁ దా నీ విశ్వమునకుఁ దల్లినను భావము పొడసూపెను. సమస్త దేశములు సమస్త జాతులు తన సంతానమను ననుభూతి కల్గెను.

అమెరికాలో నొక సరస్తీరమునఁ గొన్నాళ్ళతం డోంకార జపము గావించుచుఁ గూరుచుండెను. వ్యాధిపీడితు లనేకు లతనిని దర్శించి ధైర్యము నుత్సాహము నారోగ్యము నొందిరి. అతనిని వారు 'ఆరోగ్య ప్రసాదకుఁ' డని పిలిచిరి.

అమెరికా విశ్వవిద్యాలయములలో విద్యార్థులను ప్రబోధించుచు నుపన్యాసములు గావించెను. అందొక యుపన్యాసమున 'భారత దేశమునకు ప్రపంచ ఋణము' అను విషయమును ప్రతిపాదించెను. ఆ విశ్వవిద్యాలయపు టధ్యక్షుఁడు ఆ ప్రసంగము పాశ్చాత్యసంస్కృతిని గొలువడిన వేదాంత భావమును బూరించుచున్న దని కొనియాడెను. ఉపన్యాసానంతరము ఏవో కొన్ని గ్రంథములు రామునికి సమర్పింపఁ దలఁచి యచటి కతని గుమాస్తా తెచ్చెను. వానిలో నొకదానియట్ట కొలఁదిగ మాసి యుండుట గాంచి యధ్యక్షుఁ డిట్లనెను, "స్వామిజీ యుపన్యాసమును వినలేదా? వారిమహత్త్వమును గనలేదా? ఈ పుస్తకము లెవరికి సమర్పింపఁ దలపెట్టినది నీ వెఱుఁగవా? పరమ పూజ్యుఁడగు శ్రీరామదేవునకుఁజుమా మన విశ్వవిద్యాలయము గ్రంథములు సమర్పించుచున్నది. దీనిని దీసి మఱొక నూతన ప్రతిని

గానికమ్ము." ఈ యుద్ఘాటనము రామతీర్థునియెడ అమెరికను విద్యావంతు లెట్టి భావమున మెలఁగుచుండిరో స్పష్టీకరించు చున్నది. ఇట్లే మిగిలిన విశ్వవిద్యాలయములవారు నతని వాక్యుల లోని యమోఘ సమ్మోహనశక్తికిఁ బరవశులై యతనిని బూజించిరి. అతఁ డిండియానిమిత్తము విరాళములు ప్రోగుచేయ లేదుగాని అమెరికావాసుల హృదయములపై భారతీయ ముద్ర నైచెను.

అతనికొక సంపన్నుఁడు మిత్రుఁడై యుపన్యాస సభల నేర్పాటు గావించుచుండెను. ఉపన్యాసములకు శ్రోతలుమున్నుగ టిక్కెట్లు కొనుట యాదేశపు టాచారము. కాని రామతీర్థుఁడు తన యుపన్యాసముల కట్టి యేర్పాటు వలదని యా మిత్రునకుఁ జెప్పెను: "ఉపన్యాసముల కేర్పాటులకగు కర్చులు నైతము నిట్టవు" అని యామిత్రుఁడన, "నిజముగా నీ వా వ్యయముల భరింపఁగలవు. భరించు"మని యతని నొడంబఱచెను.

పాశ్చాత్యులు సాధారణముగ సభ్యుల సంబోధించునెడ స్త్రీ పురుషులారా, Ladies and Gentlemen, యందురు. సోదర సోదరీ మణులారా, యనుట మన భారతీయ సాంప్రదా యము. దీనివనుసరించియే శ్రీ వివేకానందస్వామి షికాగో నగరమున జరిగిన విశ్వమత మహాసభలో సభ్యుల సంబోధించి యపూర్వ సంస్తుతు లందుకొనెను. ఇఁక రామతీర్థుఁడో "మదీయాత్మస్వరూపులగు స్త్రీ పురుషులారా!" యని సంబో ధించెను. ఇది యాత్మజ్ఞానసిద్ధికి నిదర్శనము; వేదాంతపరము.

రామతీర్థుఁ డమెరికాఖండమున ననేక మహానగరములలో ననేకోపన్యాసము లిచ్చెను. భారతీయ విద్యార్థులు అమెరి

కాలో విద్యా సముపార్జనముచేసి తమదేశపు టున్నతికిఁ గృషి చేయుటకు సౌకర్యములు కొన్ని కల్పించెను. తన యాధ్యాత్మిక మహత్త్వమునకు లోఁగిన యమెరికను నరనారీ సమూహము లతనికి శిష్యసమాజములై యతని బోధల నాచరణమునఁ బ్రదర్శింప సమకట్టినవి. వెల్‌మన్ సతి శిష్యురాండ్ర నగ్రేసరయై 'సూర్యానంద'యను నామము నడసి సన్న్యాసినియై మతప్రచారము గావించినది.

స్వామి యిచ్చిన యుపన్యాసములలో యూనిటేరియన్ చర్చిలోఁజేసిన 'ఆత్మవికాసము' అనునది యొకటి. అందు కళాశాలలలో గణితశాస్త్రాధ్యాపన విధానము నవలంబించి వలయములగీచి వివరించుటచూడ నతని బోధనాకౌశలము వ్యక్తము గాఁగలదు. వినువారికి విసుగుగలిగించు వేదాంతశాస్త్రమును సుబోధము గావించుటలో రామతీర్థుఁడు సమర్థుఁడు.

అమెరికాలోనే యతని యుపన్యాసానంతర మతని యీ గీతము మనోహర వాద్యధ్వని సమ్మేళనమున హృద్యముగ గానము గావింపఁబడినది.

హృదయాల యంబులోఁ
ప్రేమోజ్జ్వలజ్యోతి
వెలుఁగు జిలుగులఁ జిమ్మ.
కంటకావృత మయ్యుఁ
బ్రేమ ప్రసూనమ్ము
స్వాతంత్ర్య సౌరభము
జగతికెల్లనుబంచు. 1

అవిరళానంద. ని
ష్యందియై స్పందియై
కందళించు వినూత్న
కాంతి వెల్లువలతో.
ఉన్మత్తులుగఁ జేయు
చున్న కంఠనినాద
మే స్వర్గ మారు త
మ్మెనసి యే తెంచెనో. 2

పొసఁగెనుఁ గాంతి యా
సంపంబు సహకార
సుందరంబోహో! యా
నందంబు దివ్యంబు.
పొంగు లెత్తుచు వచ్చు
సంగీత ధునియదే
శృంగాధిరోహణో
త్తుంగ భంగము నాదె. 3

పారతంత్ర్యము లేని
పైడి రెక్కలపక్కి
పాడుచున్న దెవో సు
ఖస్వాగతి గీతికల.
వికసించు మధులక్ష్మి
సుకుమారతతి బాహు
నెపఁదఁ జేల్చుచువచ్చు
నుడుల స్వాగతగీతి. 4

ఉదయ సంధ్యారాగ
సదనముల్ శాద్వల
స్థలులుసరసులు గిరుల్
సంబరంబున మెఱయు.
అమ్మహా కారుణ్య
మనునీల జీమూత
మమృత శీతలవృష్టి
హాయి హాయనఁ గురియు. 5

రంగు రంగులవిల్లు
రంగారు హరివిల్లు
చిఱునవ్వు పూలతో
దిక్చక్ర మలరించు
ముచ్చటైనవి మంచు
ముత్తెంపు ముద్దియల
గర్భస్థుఁడగు శిశుం
గనుఁడదే భాస్కరుని. 6

అతఁడాత్మ రాజ్యాధికారియై తాను రామ పాదుషానని చెప్పుకొనెను. అతఁడీ పదము విద్యాహంకార పురస్సరముగ వాడుకోఁ జొచ్చెను. అమెరికాఖండము వీడి యిండియాకు వచ్చునెడ సెజ్ రేవుకడ స్టీమరెక్కుటకు సంసిద్ధుఁడై వచ్చి యాయోడలో కర్జన్ప్రభువు పోవుచుండుటగని. "రాజు లిద్ద రొక పడవలోఁ బోవుట యనుచిత" మని పలికి తరువాతి యోడలోఁ దనపయనము సాగించెను.

# శాంత్యాశ్రమము

రామతీర్థుని యఖండాద్వైత సిద్ధాంత ప్రచారము సిద్ధాంజనమట్టు అమెరికాఖండ వాసులకుఁ బనిచేసినది. రాముని వాగ్ధారచేఁ దమ పాపపంకము క్షాళితమైనట్లు తలపోసిరి. ఐహిక భోగములందు విముఖత యేర్పడినది. అతఁడు వారికి 'ఏసు' వోలెఁ దోఁచెను.

అతఁ డిండియాకువచ్చు పూర్వమధ్యమున నీజిప్టులో మహమ్మదీయుల మసీదులో నాత్మతత్త్వ ముపన్యసించెను. అతఁడు అచటి మహమ్మదీయులకు మహమ్మదు ప్రవక్తయట్లు గోచరించి వారి సౌమనస్య సౌభాగ్యము ననుభవించెను.

అతఁడేయే జాతులతో భాషించిన నతఁడాయా జాతులకుఁ జెందినట్లుండి వానిలో నాంతరంగిక పరివర్తనము తెచ్చును. యథార్థమున కాతఁడు బోధించినమతము ఆత్మ సముద్ఘాతనే గాని యన్యముగాదు. ఆత్మ తత్త్వమునకు ప్రాధాన్యమిచ్చునే గాని బాహ్యాచారముల కీయఁడు.

ఈయఖండపర్యటనానంతరము ఇండియాకుఁ దిరిగివచ్చుటవిని బొంబాయినగరవాసులు స్వామికఖండస్వాగత మొసఁగిరి. అచట నతఁడొక వారముదినములుండి వివిధాంశముల నుపన్యసించెను.

ఈవార్తవిని శాంత్యాశ్రమ స్థాపకుఁడు శివగుణాచార్య స్వామివచ్చి మూత్రాలోని తన యాశ్రమమునకుఁ గొంపోయెను.

పురాణ సింహునకు రాముని రాక దెలిసి యతని దర్శించుటకు యాత్రా కరుదెంచెను. అప్పుడు తీర్థుఁడు ఏకాంతధ్యాన

మగ్నుఁడై శాంత్యాశ్రమమున నొకగదిలో నుండెను. పురాణుఁడు వానిధ్యానమునకు భంగము గలుగునని సందేహించియు నాలస్యమున కోర్వఁజాలక యాగది ద్వారముకడ కేగి మెల్లఁగా నాతలుపు దట్టెను. లోనున్నస్వామి, 'ఎవరు వారు'? అని పృచ్ఛించెను. 'నే పురాణుఁడు' అని ప్రత్యుత్తరము. వెంటనే తలుపుదెఱచి స్వామి యీవలకు వచ్చెను. అన్యోన్య ముఖ దర్శనమున నన్య యానంద వారాశిలో నాగురుశిష్యులు ఓలలాడిరి. మూఁడు సంవత్సరముల కీయిర్వురకు సమాగమము సిద్ధించినది. రాముఁడు పురాణుని దనకు సమీపమునఁగూర్చుండ నియోగించెను. ఉత్సాహోద్రేక పూర్వకముగాఁ గంఠమెత్తి యిట్లతఁడు పలుకఁ జొచ్చెను. "త్యాగము-త్యాగము-త్యాగమూలముననే మాతృదేశదాస్య విమోచనము. రాముని కంఠము-చిమ్మట పురాణునిది-ఇంకను ఇట్టులే వందల కొలఁది కంఠములు త్యాగము గావింపఁబడవలయును. దేశ దాస్య విమోచనము లభించు దనుక నిట్టి యఖండ త్యాగములు జరుగుచుండ వలసినదే." ఈ తీవ్రోద్ఘాటనము పురాణుఁడు వినుటతోడనే "ఇతఁడు తొల్లింటి తీర్థుఁడేనా" యని యాశ్చర్య మగ్న మానసుఁ డయ్యెను. "పూర్వము స్వచ్ఛ వైదాంతిక ప్రకటనము సేయువాఁ డీనాఁ డిట్లు దేశభక్తి పరిపూరితుఁ డైనాఁడేమి?" అని యతనికి నంతరాందోళనము. "బహుశః నానాదేశ పర్యటన ఫలిత మీహృదయ సంస్కారమునకుఁ గారణమైయుండును. అతఁ డా దేశముల స్వేచ్ఛాజీవనులగు వివిధ జాతులనుజూచి స్వదేశమునకు మరలుచో నీదేశపుఁ బారతంత్ర్యజీవనము దుస్సహ మనిపించి యుండును" అనునొక

నిశ్చయమునకు వచ్చెను. అనుష్ఠానమున కక్కఱమాలిన శుద్ధ వేదాంతము ఛాందసము; వేదాంతులును సన్న్యాసులును సర్వసంగ పరిత్యాగులు గావున దేశ స్వాతంత్ర్యమునకుఁ గృషి గావించుట వారికిఁ గర్తవ్యమని రాముని తలంపై యుండునని పురాణుఁడు తలఁచి సముచిత సమాధానము లిడుచు రామునితోఁ బ్రసంగము సాగించెను.

ఇంతలో నిద్దరు మద్రాసునుండి వచ్చిరి. నల్లటోపీలు, పొడవైన వస్త్రములు ధరించియుండిరి. వారు వందనమాచరింపఁ బ్రతివందన మాచరించుచు స్వామిరామతీర్థుఁడు హృదయపూర్వకముగా హాసము నవిచ్ఛిన్న తరంగరూపమునఁ గావించెను. ఆ ప్రకారముగా నవ్వినవ్వి నవ్వుపూర్తియైనంతట నిట్లుపలికెను: "రాముని పట్టుకొనుటకు వచ్చితిరి మీరు? రాముఁడు హృదయము తెఱచియుంచినాఁడు. హృదయములోన రాముని బంధించుఁడు. ప్రపంచమున మీ కొనర్పఁదగిన పనులలో నుత్తమమైనది రాముని బంధించుటే. బంధింపుఁడు. కన్గొనుఁడు. ప్రపంచము మీకు పాదాక్రాంతమై యున్నదికదా!"

ఆసమయమున నా ప్రచ్ఛన్న వేషుల నతఁ డట్లు లెదురొక్కొనుట యొక విచిత్ర విధానముగఁ దోఁచి పురాణుఁడు నతని యనుచరుఁడును అక్కఱజంపడిరి.

ఆ వచ్చినవారు స్వామి పాదములపైఁబడి, "మహానుభావా, మన్నింపుము. మేము ప్రభుత్వధర్మ నిర్వాహకులము. అస్వతంత్రులము. మీ ముఖప్రసన్నత నవలోకించుటతోడనే మాశక్తి క్రుంగినది. మీ ప్రేమమమ్ము జయించినది," అనిపలికి సెలవుగైకొనిరి.

స్వామి శివగుణాచార్యునకు గంటలకొలది నేకాంతముగ రామునితో సంభాషించుచుండును. అతడు "ముఖ్యముగా రాజకీయాందోళన బంధవిముక్తుడవు గమ్ము. మన దేశపు స్వతంత్ర సంస్థానాధీశ్వరుల సమావేశపరచి వారల సాహాయ్య సంపదలతో నూతన సంఘముల స్థాపించి తన్మూలమున వేదాంత ప్రచారము గావింపు"మని తెలుపుచుండును.

స్వామిరాముని మానసికాంతరువు వేఱు; అది యత్యున్నతమైనది. శివగుణాచార్యుని పలుకులు తన కాదరణీయములు గాకున్నను వాని మనస్సును నొవ్వజేయుట యసంభావ్యమని యతడు తలంచెను. అందుచే వాని మాటలకేవో సమాధానములు చెప్పుచు గాలక్షేపము సేయుచుండెను. అదియుగాక శివగుణుడు రాముని బొంబాయిలో గలిసికొని తెచ్చి తన యాశ్రమవాసి గావించి యతనికి దన సర్వస్వము సమర్పించి శిష్యు డయ్యెను. ఇట్టివానిని వీడక తప్పినదికాదు. మెల్లగా నందుండి పుష్కరమున కేగి యతనికి దన యభిప్రాయ మిటు లెఱింగించెను: "నాకు రాజాధిరాజులతో బనిలేదు. నేను స్వతంత్రముగా నా మతప్రచారము గావింతును."

అతడు మధురలోనుండగా, బ్రతి సాయంతన వేళ యమునా సైకతభూములలో నిశ్చలముగ గూర్చుండి యస్తమయ భానుని దిలకించుచు నానందపరవశుడగుచుండెను. ఒక నాడు యమునను చిన్న నావలో దాటుచున్న భారతీయ క్రైస్తవులగాంచి యా సమయమున దన వెంటనున్న పురాణునిబంటు వారితో దానొకింత ప్రసంగింప దలంచితినని చెప్ప బంచెను. వారును సంతోషముతో సమ్మతించిరి. వారియెదుట నిల్వంబడి

"రాముఁడు క్రైస్తవమతమునెడఁ గృతజ్ఞుఁడు. అది మిమ్మునుద్ధరించినది. అందులకే యామతమునెడ రాముఁడు కృతజ్ఞుఁడు. హైందవులే యుపకారము మీకుఁ జేయజాలక పోయిరో, ఆ యుపకారమును క్రైస్తవులు సలిపిరి. మీరిపుడు మానవస్వేచ్ఛననుభవించుచున్నారు. మీ యిప్పటి మంచిస్థితి రాముని సంతుష్టాంతరంగు నొనర్చుచున్నది. మీరుమాత్రము మీజన్మభూమిని విస్మరింపకుఁడు. 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' యున్న ప్రాసుడిఁ బాటించి దేశమునిమిత్తము పాటుపడుఁడు" అని యింకను నేహో కొన్ని యమెరికాలోని తన స్వానుభవ విశేషములఁ దెలిపి వారలఁ బ్రబోధించి పంపెను.

పుష్కరమున స్వామి నారాయణుఁడును పురాణసింహుఁడును స్వామిరాముని యనుచరులు. కిషన్ ఘర్ రాజ్యగృహమున మకరాకరమైన సరోవర తీరమున రాముఁడు వసించుచుండెను. రామునిచేతిలో వెదురుగొట్టమొకటి గలదు. దానిని పురాణునకుఁజూపి రాముఁడిట్లనెను: "చూచితివా! పురాణ్, ఇది రాముని మంత్రదండము. దీనితో మొసళ్ళను బాజఁద్రోలఁగలను. దీనిలో బెస్తిళ్లు కాగితములు మున్నగునవి యిమిడ్చితిని" అని చెప్పుచు బిగ్గఱగానవ్వి, "నిజముగా రాజు కాఁదలఁచువాఁడు తన సామగ్రి నీ సంకుచిత ప్రదేశమున నిముడ్పఁ గలిగి యుండవలెను." అనెను.

ఒకనాఁడు పురాణుఁడును రాముఁడును పుష్కర సరస్సునకుఁ బోయిరి. రాముఁడు ముందు సరస్సులో దిగెను. పురాణుఁడును భయముతో వెన్నంటెను. రాముఁడు తన వెదురు గొట్టము నీటిపైఁ దేలునట్లు వదలెను. తన యలవాటుప్రకారము

ముక్కు చెవులను తన చేతి(వేళ్ళతో నొక్కి పట్టుకొనిమునుఁగుట
కారంభించెను. పురాణుఁడు నెట్లో ప్రాణములు బిగపట్టుకొని
స్నానము చేసెనో లేదో రాముఁడు నీటిలోఁ బైకివచ్చి, "అవిగో
మొసళ్లు. అవి తమ వాసస్థానమున నింతకంటె నెక్కుడు కాల
ముండుట కంగీకరింపవు" అనెను. తొందరతొందరగా పురా
ణుఁడును రాముఁడును బయటికి వచ్చిరి. అట్టి తొందరలోఁ
గూడ తన వేణుదండమును మఱవలేదు. అతఁడు దానిని "వీఁడు
చాల మంచివాఁడు. రాముని జక్కగా సేవించుచున్నాఁడు" అని
ప్రశంసించెను.

అతఁడు తనశిష్యుల వెంటనిడుకొని విసుగులేకుండ పుష్క
రగిరి నధిరోహించుచుండును. ఇది ప్రతిదినము చేయు సాయం
సమయ వాహ్యాళి, శిష్యులను విశ్రాంతి పుచ్చుకొనీఁడు. ఓంకార
గానము సేయుఁడని యాజ్ఞాపించును. ఎవఁడేమాత్ర మీ విష
యమున నశ్రద్ధ జూపినను క్షమింపఁడు. ఒకప్పుడా పర్వతసాను
వుల నొకఁట నొక రాతిపై నతఁడు కూర్చుండి, "ఎందులకీ
మానవులు దేవుని జూడఁ జాలరు? పిలువుఁడు. వారిని రమ్మ
నుఁడు రామునికడకు, దేవుని జూడఁగలరు" అని పలుకుచుఁ
గనులుమూసెను. కనులనుండి బాష్పధారలు కురియఁజొచ్చెను.
ముఖము దేదీప్యమానముగా వెలుగఁజొచ్చెను. బాహువులు
చాచి విశ్వవిశ్వంభర నాలింగనము చేసుకొనువాఁడు వోలెఁ
దోఁచెను. "భగవంతుఁడు – భగవంతుఁడు – ఇచ్చట భగవంతుఁ
డున్నాఁడు. చూడఁదలచినవా రిచ్చటికివచ్చి చూడవచ్చును"
అని పలుకుచుఁ బై పెదవితోఁ గ్రిందిపెదవిని నొక్కెను. అతని
ముఖమునఁ దల్లిని గన్నబిడ్డభావము ప్రస్ఫుట మగుచుండెను.

పసిపిల్లలు అమాయికులై తల్లిదండ్రులపై నాధారపడు భావము కనఁబఱచుచు నతని పెదవులు విడివడుచుండెను.

అతఁ డిట్లే యప్పుడప్పుడు మాటాడుచు మాటాడుచు మౌనములోనికిఁ బోవుచుండును. అప్పు డుత్తుంగతరంగయై నిస్వ సించుచు వచ్చి మైదానమునఁ జల్లగా వడితగ్గి మందగమనయగు నదివోలె నతఁడు తోఁచును.

రాత్రులం దాముదపు ప్రమిదనో క్రొవ్వొత్తినో వెలిఁగించి నజీరుకవి కావ్యమును బఠించుచుఁ దనలోఁ దానూరక నవ్వుచుండును. నజీరున కతఁ డత్యంత మిష్టుఁడు; అతని స్వాతంత్ర్య మితని కానందము; దాని నితఁడు పలుమరు కొనియాడును. "అతఁడు రాముని స్వతంత్ర బాలుఁడు. అతనిలో స్వల్పదోషము లుండవచ్చును. రాముఁడు వానిని గణింపఁడు. అతఁడు భగవంతుని నినదించు మంచి లోహము" అని తఱచుగఁ బలుకును.

పంజాబీ జానపదవాఙ్మయమున గోపాలసింహుని గీతము లన్న నతనికిఁ బ్రీతిమెండు. అతఁడు వానిని కవియావేశములోఁ గనులు మూసికొని తన్మయుఁడై గానము గావించును. తాను శాయిల్ కోటలో వసించినద్దాది గోపాలసింహు నాతఁ డెఱుఁగును. "ఈ సజ్జనుఁడు బృందావనమునకుఁ బాదచారియై పయనించి పోయెను. అతఁడు తన జీవితమంతయు నాత్మజ్ఞాన మధూన్మత్తుఁడై నాట్యము గావించెను." అని రాముఁ డతని గూర్చి తెలుపును.

అతఁ డెవనిని గూర్చియు విమర్శింపఁదన శిష్యులలో నెవని ననుమతించువాఁడుగాఁడు. అతఁడు పలుకునదిది: "ప్రతి విష

యమునందును ప్రతి వ్యక్తియందును మంచిచెడ్డ లుండును. మంచిని గైకొనుటలగ్గు. అతఁడు లేక అది తానే యనుభావమున దోషములకుఁ బరిహారము చెప్పుకొనవలయును. అట్లుగాక చెఱుపును గైకొని కాసంతను గంపంతగఁ జేయు వ్యక్తిగత విమర్శలు చెఱుపునే కలిగించును."

కాని యెవఁడో యొకఁడు భారతదేశము - దాని నాయకత్వము మున్నగు విషయములఁగూర్చి ప్రసక్తి దెచ్చి వ్యక్తిగత విమర్శలకు దిగును. వెంటనే యాతఁ డోంకారనాదము చేసి, "ఇదిగో! దేవాలయ ఘంట మ్రోగినది. వ్యక్తిగత విమర్శలు చాలింపుఁడు" అని యోంకారనాదమున కెల్లఱఁ బ్రోత్సహించును.

ఈ సందర్భమున నొక వినోద సంఘటనము స్మరించుట లగ్గు. మద్రాసు ప్రాంతీయుఁడు నాయుఁడను నొక కుఱ్ఱవాఁడు లాహోరు టెక్నికల్ స్కూలునుండి వచ్చెను. ఇతఁ డమెరికాలో రసాయనశాస్త్ర పరీక్షకుఁ జదివి కృతార్థుఁ డయ్యెను. అతఁడు రామునకు హనుమంతుని విధమున నమ్మినబంటు. రాముఁడు, "నాయుఁడూ, డాల్" అనుటతోడనే 'ఓమ్' అని నాయుని సమాధానము. డాలును తెచ్చి వడ్డించునప్పుడును, 'ఇదిగోనండీ డాల్' అనఁడు. దానికిని 'ఓమ్' అనియే యతఁడనునది. అతఁ డెల్లప్పుడేదానికైనను ఓంకారోచ్చారణమునే గావించుచుండుట గని యొకప్పుడు పురాణుఁడును నతనిమిత్రులు అది తలంపునకు రాఁగా వినోదించుచు నొకపూటయే గడిపిరి. ఎట్లు? కడుపు చెక్కలగునట్లు నవ్వుచు.

రాముడొకసారి పుష్కర యజ్ఞభూమికి పురాణుని నారాయణుని, పలువుర నితర శిష్యులం గొంపోయెను. యజ్ఞ భూమినిగూర్చి పూర్వకథ యొకటుగలదు. దానిని రాముడిట్లు వారలకుం దెలియం జెప్పెను. ఈభూమియందు పూర్వము దేవతలు మునులు నొక బ్రహ్మయజ్ఞము చేసిరి. ఆయజ్ఞమునం బూరింపబడిన శంఖము మ్రోగలేదు. యజ్ఞపరిసమాప్తి తృప్తి కరముగ నైనందులకు భగవంతుని సంతోషమునకు సూచకముగ శంఖధ్వని భావింపంబడు చుండెను. అప్పు డేదో యొకలోపము యజ్ఞనిర్వాహణమున సంఘటిల్లి యుండవలెను. మనశ్శాంతి శుద్ధ్యముగల వ్యక్తి యిందు గొఱవడెననుట స్పష్టము. ఇక్కడ నీయజ్ఞము సాగుచు నుండఁగనే యథార్థమైన బ్రహ్మయజ్ఞము ఆసమీపమునం బొలములో గడ్డిగోయుచున్న యొక కాఁపువాని హృదయమున జరుగుచుండెను. అతఁడు తన సమస్తమును పరమేశ్వరార్పణము గావించి బ్రహ్మతత్త్వ ధ్యానమగ్నుఁడై యుండ గడ్డిని కోయుచున్న కొడవలి తప్పివచ్చి యతని చేతికిఁ దగిలెను. కాని రక్తము రాలేదు. గడ్డిలోనున్న నీరే యొకింత చేతినుండి స్రవింపఁ దొడగెను. ఆహా! ఏమి యానందము!! ఏమి పారవశ్యము!!! ఆకర్షకుఁడు తాండవముగావింపఁ జొచ్చెను. భగవానుని నామ మతనినోట నమృత ప్రవాహమై యలరారెను. దీనినిఁగని మునులు దేవతలు నతని పాదములపైఁ బడిరి. అతనికి దేహస్మృతియే లేదు. వారును నతఁడొనర్చు నామకీర్తన మందుకొని కుశలవులు రాముని గీర్తించుచుఁ హనుమంతుని దమ యాశ్రమమునకుఁ గొంపోయినట్లు యజ్ఞ భూమికిఁగొంపోయిరి. అతఁడు యజ్ఞభూమియందు పదార్పణము

గావించుటయే తడవు శంఖము భూనభోంతరాళములు ప్రతిధ్వ నింప మ్రోగెను! చూచితిరా! యథార్థమైన యజ్ఞమన నిది. వేదాంతమనిన నిదియే."

మథురాలో రాముఁడుండగా నతని బోధలు వినుటకు ప్రజలు గుంపులు గుంపులుగా నతనికడకు వచ్చుచుండిరి. ఆజన సమూహముల వెంటనిడుకొని పుర బాహ్య సైకతస్థలులకుఁ గొంపోయి రాముఁడు వారి కాధ్యాత్మిక ప్రబోధము గావించు టకు మున్నతఁ డుండజుచే వ్యాయామము చేయించుచుండెను. వారలలోఁ దలలు గడ్డములు నెఱసిన ముసలివారు సైతము గలరు. బ్రహ్మజ్ఞానమున నెట్టివారును బిన్నవారేగదా! అతఁ డుండజుచే నట్లు వ్యాయామము చేయించి కూర్చుండఁ జేసి బ్రహ్మానంద పారవశ్యమున గానము సేయుచుఁ దాండవించు చుండెను. ప్రేక్షకులాతని వినుచుం గనుచు నానందమున నొడళ్ళు మఱచుచుందురు.

పుష్కరమునఁ బలువు రాతని సమీపింపలేను. అన్నము మాత్ర మతని నాశ్రయించిరి. వారి కాతఁడు, 'ఆశయరహిత ముగా నవిచ్ఛిన్నముగా సంచారములు గావింపుఁడు. సంచార ములు చేయుటకొఱకే సంచారములు చేయుఁడు. ఫలితము నాసింపకుఁడు" అని ప్రబోధించి పంపెను.

అతఁడీకాలమున నొనర్చిన యుపన్యాసము లన్నియు దేశభక్తి పూరితములు. ముఖ్యముగా నతఁడు యువజనులఁ ప్రబోధించుచు విమర్శము, విశ్వప్రేమ, యజ్ఞము, జాతీయ ధర్మము, బ్రహ్మచర్యము, దేశభక్తి యను విషయముల నతి

మనోజ్ఞముగ విపులీకరించెను. రాయ్ బాయ్ జీనాథుని 'హిందూ మతము - పురాతనము, ఆధునికము' అను గ్రంథమున కీతఁడు వ్రాసిన యుపోద్ఘాత వ్యాఖ్యానము వహించు కళాఖండిక. అది చదివిన వారికతఁడు త్యాగశీలుఁడైన భరతపుత్రుఁడని తోఁపక పోదు. కాని యతఁడు తరములలో కేవల మాత్మజ్ఞాన ప్రపూర్ణుడుఁగనే యధికముగ గోచరించును.

ఈకాలము శీతకాలమగుటచే నతఁడింటి పైకప్పుపైఁ గూర్చుండి యుదయ సంధ్యారాగమనుభవించుచు వివిధప్రాంతములవారికి నతఁడు వ్రాసిన లేఖ లమూల్యములు: సందేశ సంభరితములు; అనురాగ పూరితములు. అంత్యానుప్రాస ఛందో నిబద్ధ పద్యములకంటె నీలేఖా వాఙ్మయ మతని కవితాప్రతిభకు మెఱుంగు దెచ్చునని పురాణుని యభిప్రాయము. ఈలేఖలలో నతనిలోని సూర్యకాంతి విద్యోతమానమగుచున్నది. ఉర్దూ పారశీక గీతములలో నతని యాత్మసౌరభము విరజిమ్మఁ బడుచున్నది.

## వ్యాసాశ్రమము

రామతీర్థుఁడు బాల్యమునఁ బారశీకాది భాషలలోఁ బరిశ్రమ గావించెను. కళాశాలలోఁ జదువునపుడు సంస్కృతము నత్యంత స్వల్పకాలమునఁ బరీక్షావసరముల కెట్టి లోపమురానట్లు లభ్యసించెను. పిమ్మట నాతఁ డంతగా గీర్వాణవాణి నారాధించి యుండఁడు. అతఁ డాంగ్లమునఁ బరిశ్రమించెను. ఆత్మజ్ఞానోత్తేజకములగు సంస్కృతగ్రంథము లేకొన్నిటిఁ జదివెనో. అతని కాత్మతత్త్వజ్ఞత యధికముగ ధన్నాజీ ప్రభావమునను, స్వాత

నందమందుచుండెను. అతఁడు వేదానువాదములఁ గొన్నింటఁ గల దోషములను, దురన్వయములనుజూచి తత్కర్తల తెలివికి నవ్వుచుండును. కొందఱు వేదములోనే సమస్త శాస్త్రములను ఆధునిక విజ్ఞానశాస్త్ర పరిశోధనములను సైతము గన్పఱపఁ జూతురు. అట్టివారల యత్నము లాతనికి వినోదమును గలిగించుచుండును. "ఎవరి యిచ్చవచ్చినట్లు వారు వేదముల వ్యాఖ్యానింపవచ్చును. అన్వయములు గూర్పనగును. ఉదాహరణమునకుఁ దీసికొందము. రాముఁడు హాఫీజు ద్రాక్షాసవమును దివ్యమధువుగ భావించి యానందించును. కాని తన యభిప్రాయమే యెల్లరు గ్రహింపవలయునని తలఁపరాదు. అట్లులే వేదవాఙ్మయ సాంప్రదాయమునకు విరుద్ధములగు నన్వయము లొనర్చుట యివియే సిద్ధాంతములని నిర్ణయింపఁజూచుట యెంతయు హాస్యాస్పదము. శాయనాచార్యుఁడే వేదవీధులలో జిజ్ఞాస సాగింపఁ దలఁచువారికి మార్గదర్శకుఁడు. పాశ్చాత్య పండితుల విమర్శకశక్తియుఁ బ్రశంసనీయమే. తాఁ బట్టిన కుందేటికి మూఁడే కాళ్ళనువారు కొందఱు భారతీయులలోను గలరు. వారు గర్హణీయులు." అని తన యభిప్రాయము లప్పుడప్పుడు వెలువరించుచుండును. రాముఁడు వేదములఁగూర్చిన యూను పూర్వీకాభిప్రాయములను స్వకీయాభిప్రాయములను వ్యక్తీకరించుచు నొక యుద్గ్రంథమును వ్రాయఁ దలపెట్టెను.

ఒకనాఁడు రాముఁ డొక పలక రాతిపైఁ గూర్చుండియుండ మేఘము గ్రమ్మెను. అతఁ డంతకుమున్నే స్నానము గావించియుండెను. అతఁడు భక్తితన్మయతచే రాధాత్వమునంది శ్రీకృష్ణదర్శన లాలసుఁడై పరితపించెను. "స్వామీ, నీనవలావణ్యమును

నన్నుఁ జూడఁగోరసిమ్ము. నీవు నా హృదయకుహరమును బ్రవే శింపుము" అని యేవో ప్రణయ మాధుర్యమును వికసిమ్మ పలు కులఁ బలుకఁ దొడఁగెను. ఇట్లు లాతఁడు భావించుచునే కాన్పెను. కొంతతడవునకా బ్రహ్మానంద్యము తొలఁగెను. వేదములఁ బఠింపఁజేసిన మహనీయుఁడుగా నింతకుమున్న వెలువరించిన యర్థమునే తెలుపు చుండెను. అప్పుడాతని యానందమునకు మేరయుండునా?

## వసిష్ఠాశ్రమము

వ్యాసాశ్రమ వాసానంతరము కొంతకాలమునకు హిమ త్పర్వతములందే స్థలము మార్చి తన గోత్రర్షియగు వసిష్ఠుని పేర నొక యాశ్రమము గల్పించుకొని యందు నివసింపఁదొడఁగెను నేఁటి రామతీర్థుఁడు నాఁటి వాఁడు కాఁడు. ఆ పారవశ్యము, ఆ యావేశము, ఆపట్టరాని నవ్వు అన్నియు నేఁడంతరించినవి. ఆయుత్సాహతరంగములు ముఖమండలమున నిప్పుడు పూర్వము వలె నుప్పొంగుట లేదు. ఐననేమి, అతని కిప్పు డాత్మవిస్మృత మైనదనియు, బ్రహ్మానందానుభూతి కొఱవడెననియు ననుట సాహసము.

ఆతఁడీ జగతీతలమునఁ గడపినది ముప్పది మూఁడేండ్లు యినను అతడొనర్చిన నిత్య పరిశ్రమము ననుసరించి పరికించిన నూఱేండ్లు నిండినవని తలఁపవచ్చును. తన యనుభవముల సత్యాన్వేషణ ఫలితముల లోకమున కందిచ్చుటకే యతఁడు నిత్యము కృషిచేసెనుగాని తన మనుగడను శాశ్వత మొనరించు కొను తలంపతనికి లేదు. భౌతికదేహము నెంత జాగరూకతతో

నిలువఁ బెట్టుచు వచ్చినను జరామరణరుజలు దానిని వెన్నంటియే యుండును. ఈమంటికొంపకు శైథిల్యము సహజగుణము.

రామతీర్థున కీతరుణమునఁ దాను స్వీకరించిన తురీయాశ్రమమునకుఁదోడు తురీయావస్థయుఁ దటస్థించి యుండునని తలఁపఁదగును. అందుననే యతఁడు శక్తి శూన్యునట్లు నడచుచు నడచుచు నడువలేక పడిపోవును. అప్పుడాతఁడిట్లు ప్రలాపించును. "హా! రాముఁడిప్పుడు తన హృదయాధినేతను మఱచినాఁడు. లేకున్నఁ బడియుండఁడు. అంతః పతనము వలననే బాహ్యపతనము. బాహ్యపతనము అంతఃపతనమునకుఁజిహ్నము. ఎల్లప్పుడు సంతస్సును జాగృత మొనర్పుము. భగవంతుని మఱచి శ్వాసింపకుము. ఉచ్ఛ్వాస నిశ్వాసములలో నతని నింపుము." నిజమున కాతఁడు తనప్రియుని భగవానునివిస్మరించెనని మనము తలపోయరాదు. ఈనిర్వేదము సైతము భక్తిజనితమే.

అతఁడు సాయంతన వేళలందు నాడుచుఁ బాడుచుఁ గరతాళధ్వనులు సేయుచు నుజ్జ్వలించును. అతఁడు శుద్ధ వైష్ణవ తత్త్వమూర్తియై చైతన్యుని హరిభక్తి పారవశ్యమును స్మృతికిఁ దెచ్చును.

అతఁడీ దినములలో బాజ్‌నాథుఁడను న్యాయాధికారి రచించిన 'ప్రార్థన' యను హిందీ గ్రంథమున కుపోద్ఘాతమును వ్రాసెను. అది వసిష్ఠాశ్రమ వాసకాలమున నాతని మానసిక స్థితిని వ్యక్తీకరించును.

రామతీర్థుఁ డనేక గ్రంథములఁ బఠించెను. ఈదినములలో సైతమతని కాగ్రంథ పఠనాసక్తి తగ్గలేదు. కాని పురాణుఁడు

గ్రంథమతని కిచ్చినఁ బరుండియే చదువ యత్నించును. కనుల నీరుగ్రమ్మఁ జదువనేరక యప్రయత్నముగనే యాగ్రంథమును జాఱవిడుచును. అతఁ డప్పు డధిక మధుర వేదన ననుభవించుచు 'రాముఁడింక బతింపఁజాల' డనును. ఇది యతనియాత్మజ్ఞాన శూన్యతయా? ఆత్మజ్ఞాన పారమ్యతయా? ఇదిపురాణుని జిజ్ఞాస.

స్వామి నారాయణుఁ డొకింత వైద్యుఁడుగూడ. అతఁడీ స్థితి యొక రోగలక్షణమనియు సందులకతఁడు దీసికొను నాహారము నందలిలోపము కారణమనియు నిర్ణయించి బలవర్ధ కాహారములఁ బుచ్చుకొమ్మని బలవంతము సేయఁ దొడఁగెను. ఈబలవంతము సేతకుఁ గారణ మాతని భక్తియే. రామ నారాయణుల కీ తరుణమున భావ భేదము తటస్థించెను. నారాయణునకు రాముఁడు గురుఁడయ్యును చిరకాల పరిచయుఁ డగుటచే నతని యెడఁ జనవధికము. అందుచే రామునియెడ నెడనెడ లక్ష్యము లేనట్లు వర్తించును. అయినను రామునకీతఁడు సౌమిత్రియే.

ఒకనాఁడు నారాయణుఁడు రాముఁడు నిష్క్రియుఁడై యుంటకప్రియుఁడై యతనినొకింత కార్యోన్ముఖుఁ జేయఁ దలపెట్టి, బుద్ధ కేదార హిమానీనదముల కేఁగఁ బయనము గట్టెను. స్వామి యందుల కంగీకరించెను. పురాణుఁడును సిద్ధమే. వారు విష్ణు పర్వతాధి రోహణము గావించుచుండిరి. అత్యున్నత స్థానము జేరఁబోవుసరికి సాయంసమయ మయ్యెను. సూర్యుఁ డపరాంబుధి మగ్నుఁడుగా నుండెను.

అందొకింత పచ్చిక ప్రబలెఁ గాఁబోలు! పసుల కాపరి యొకఁడచటఁ బసులఁగాయుచుండెను. వాఁడు [illegible]

నొంటు నిర్మించుకొని యుండెను. మన సన్న్యాసులు ముప్పూ టతని సమీపించిరి. ముందు నారాయణుడును బిమ్మటఁ బురా ణుఁడును వాని నొకింత స్థలమిమ్మని బ్రతిమిలాడిరి. వాఁడు 'ససేమిరా' యనెను. ఏమాత్రము చోటీయననెను. ఇఁక రామునివంతు వచ్చినది. రాముఁడు 'తత్త్వమసి'ని స్మరించి కుటీరమును బ్రవేశించెను. తోడ్తో నిరువురు జనిరి. గోపా లుఁడు భక్తితో వారలఁ బూజించెను. అతఁడు నాగోపాలుని హృదయ నిశీథమునఁ బ్రబోధ చంద్రోదయమును గల్పించెను. ఆ రేయి యచ్చ్టు గడచెను.

సూర్యోదయపూర్వమే మేల్కాంచి రాముఁడు పురా ణుని బిలిచి, "చూడు ముదయభానుని; అదె కాంచుము. బదరీ నారాయణక్షేత్రము మొదలు జమ్నోత్రి పర్యంతము; అవె హిమాలయ హిమానీ నదములు; ఈదృశ్యమెంత మనోహరము; ఈ ప్రకృతినంతయు నదె పైడిపూఁత బూయుచున్నాఁడు సూర్య భగవానుఁడు. రాజుగదా యీతఁ డీ విశ్వమునకు!" అని హృద్య ముగ వర్ణించుచుఁ జిత్ర విచిత్ర సృష్టివెనుక నున్నఁ దత్కర్త నన్వేషింపఁ దొడగెను.

అతఁ డింక నా యాత్రను సాగింపఁ దలపెట్టలేదు. "ఆత్మ లోని యాతని విస్మరింతుమేని యద్రులఁ గ్రుమ్మరిన ఫలమేమి? ఆత్మలో నిశ్చలముగ నతని బ్రతిష్ఠించి యుందుమేని గృహమున నుంటయే భాగ్యము. లేనిచో నెందున్నను నొకటే!'' యనెను.

పురాణుఁడు గురుని భావమునకుఁ బ్రతికూలుఁడు గాక పోఁగా నతని కనుకూలముగాఁ బ్రయాణమునకుఁ దన యశక్తిని

ప్రకటించెను. రాముఁ డంతట నారాయణు నుద్దేశించి యిట్లు పలికెను. "పురాణుఁడు నడువఁ జాలఁడు. పాప మతని మడమలు పొంచునకుఁ బగిలినవి. అతఁ డిట్టి దీర్ఘయాత్రల కలవడినవాఁడు కాఁడు. మన మాశ్రమమునకు మఱలుదము."

నారాయణుఁ డగ్గిరాముఁ డయ్యెను. "మీవంటి పెద్దన్నలతోఁ బయనించుట నాదే దోసము." అని విసుగుకొని, "స్వాములవారూ, తమ యడుగులే తడబడుచున్నవి. పురాణుఁడు చక్కఁగనే నడువఁగలఁడు. మీరు వానిని సాకుగాఁ గొని మీయశక్తతను సమర్థించుకొనఁజూచు చున్నారు. మీరు నడతురేని పురాణుఁడు తప్పక నడచును", అనెను.

ఈ యధిక్షేపణము సహింపరానిదే కాని దూషణభూషణ తిరస్కారములు మహాత్ములకుఁ దుల్యములే కదా! 'రాలన్ బూలని దూషణజాలము వేదోక్త మంత్రజాలంబని, పెన్ ధూళిం గంధపుఁ బొడియని' నాఁడు బ్రహ్మయోగీంద్రుఁ డుదలఁప నవి యట్లే కాలేదా? ఇది 'బెంగాలు బహుమతి' యనిపాదరక్షా ప్రయోగమును గాంధిమహాత్ముఁడు శిరసావహింపలేదా?

అణుమాత్రమేని చలింపక, "నారాయణజీ! మన మాశ్రమమునకు మరలక తప్పదు" అని స్వామి యనెను. అట్లే వారాశ్రమమునకుఁ జనిరి.

ఇట్టులే యనేక సందర్భముల 'నారాయణుఁడు కటువుగ విమర్శించును. "నాయనా, నారాయణా! విమర్శవలదు" అని రాముఁడు బ్రతిమిలాడును. వ్యక్తిగతదుర్విమర్శ లెవ్వియైనను నెవ్వని

గూర్చియైనను జేయరాదని రాముఁడు శిష్యుల శాసించెను. ఈశాస
నము నెప్పుడు నెవ్వఁడో యొకఁ డతిక్రమించుచునేయుండును.

ఒకప్పు డొకవ్యక్తిని నారాయణుఁడు తీవ్రవిమర్శ
పాల్సేయు చుండెను: రాముఁడు తనయాజ్ఞను స్మరణకుఁ
దెచ్చెను. "లేదండీ, నేను వానిని విమర్శించుట లేదు. ఆతని
మనస్తత్త్వమును బరిశీలించు చున్నాను. అంతియే" అని నారా
యణుఁ డనుటతోడనే రాముఁడు పట్టరాని నవ్వు నవ్వెను.
ఇట్టి యుక్తి ప్రియుక్తులతో శిష్యులతని నొకింత గేలిసేయుచుఁ
గాలము పుచ్చుచుండిరి. కాని యతని మానసికాందోళనము
వారికేమి తెలియును? పాపము! వారింకను బాలురే! రామున
కేకాంత వాసప్రీతి జన్మతః కలదు. ఇప్పుడా తనకది యత్యా
వశ్యక మయ్యెను. తుదకు నారాయణుని సాహచర్యము సైతము
బంధ హేతువుగఁ దోఁచినది. అతనిని దనకుఁ బదునేనుమైళ్ళ
దూరమునఁ బ్రత్యేకముగ వసింప నాజ్ఞాపించెను.

ఇట్లుండ పోలీసులతని, భారత జాతీయ నాయకునిగను
బ్రిటిషుప్రభుత్వమును దలక్రిందొనర్పఁ దలపెట్టిన వానిగను సంశ
యించి వెన్నాఁడు చున్నారను నొక జాబతనికిఁ జేరెను. అతఁ
డద్దానిఁజూచి, " నన్ను నేను సమర్థించుకొనని చెప్పుఁడు.
వారెట్లైనను నన్ను దలఁపవచ్చును. నాకెట్టి యభ్యంతరమును
లేదు. నన్ను నేను మార్చుకొనను. నేను భారతీయుఁడను
గనుక భారతదేశ విముక్తి కెన్నఁడును వ్యతిరేకినిగాను. మాతృ
విముక్తి నాకాంక్షించు భారతపుత్రులలో నొకఁడ ననునది ముమ్మా
టికి సత్యము. ఈరాముఁడు దేశమునకు స్వాతంత్ర్యము సమకూర్ప

గలుగునో లేక యిట్టిరాములుపదివేవురు సమకూర్పఁగలరో చెప్ప జాలనుగాని యెప్పుడో యొకప్పుడు భారతదేశము స్వతంత్రేము కాఁగలదనుట యథార్థము" అని యావేశపూరితుఁడై చెప్పెను.

పురాణునకును రామునిసెలవుదీసికొనఁ దరుణము వచ్చెను. వసిష్ఠాశ్రమమును వీడ్కొనునాఁడు రాముఁడు తన్ను స్నానము చేయింపుమని యడిగెను. పురాణుఁడు తుండుగుడ్డను తైలమునుగొని యతనివెంట నంటెను. అతని శరీరమునకు బాగుగఁ దైలముపూసి స్వహస్తములతో నతనిని సుస్నాతుని గావించెను. ఆనాఁడాకాశము మేఘావృతమై యుండెను. ఆశ్రమమునకు వచ్చుటతోడనే పురాణుఁడు సెలవుగైకొన స్వామి చరణముల స్పృశించెను. "పురాణజీ నీవెచ్చటి కేగినను సరియే, యీసువర్ణ భూఖండమును నీయాత్మ సామ్రాజ్యమును విస్మరింపకుము. రామతీర్థుఁడు ప్రారంభించిన పనిని సాగింపుము. కారణ మేమందువా? వినుము. రాముఁడికమౌనమున మునుఁగును" అని రాముఁడు తెలిపెను.

"స్వామిజీ, యీసారి మీకడకు వచ్చునప్పటికి మౌన ముద్ర వహింతురేని, మిమ్ము గిలిగింతలుపెట్టి మీమౌనమునకు భంగము గావింతును. ఏమందురు?" అని పురాణుఁడనియెను.

రాముని నేత్రము లరుణము లయ్యెను. గంభీరముగా నిట్లనెను. "మౌనముద్రాభూతుని ఎవ్వఁడుమాటాడింపఁగలఁడు?"

పురాణుఁ డామాటలకుఁ బ్రతిపలుక వెడలెను.

పురాణుఁడు అనుచర సహితుఁడై బయలుదేరెను. స్వామి నారాయణుని వారినిబంప నియోగించెను. వారి యందఱు వెనుక

దానును నడచుచుఁ గొంత దూరమంపెను. అప్పు డాతడొక యంగవస్త్రము మాత్రమే ధరించి యుండెను. అతఁడు నది నుండివచ్చినపు డున్నపాటుననే వచ్చెను. ఇట్లువచ్చి యకస్మాత్తుగఁ గొండ పైభాగమునకుఁ బర్వెత్తి పురాణునితోడి బంధములఁ ద్రెంచుకొనుటకు గుఱుతుగా వెనుకకొక చూపైనఁ బ్రసరింపక యదృశ్యుఁ డయ్యెను.

పిమ్మట నొక నెల కాతఁడాగిరి నవరోహించి శిష్యుఁడగు టెహ్రీమహారాజు కడకేగి యతని యాతిథ్యమును స్వీకరించుచు నతని భవనమునఁ గొంతకాలము గడపి, తనకొక కుటీరమును నిర్మింపుమని యడిగెను. స్వామి నారాయణు నాభవనమునకుఁ జాలదూరముదనుకఁ బంప వచ్చి పురాణునకిచ్చిన యంత్య సందేశమే యిచ్చెను.

నారాయణుఁడాతని మఱలఁ జూడలేదు. పురాణుఁడు నంతియే. ఈరెండు వీడ్కోళ్ళును రానున్న రాముని మృతికి సూచకములని యాయిర్వురును దలంపరైరి.

రాముఁడు సిమ్లాసు భవనములో నివసించుచుఁ బత్రికలకు వ్యాసములు వ్రాయుచుఁ గాలక్షేపము చేయుచుండెను. దీపావళి మఱునాఁడుగదా యతని జననము! ఇప్పుడును దీపావళి వచ్చుచున్నది. అంతకు మున్నొక పక్షము దినముల క్రిందట నొక నాఁడతఁడు గంగానదిలో నీదుటకొక కొండఱాతి మీఁద నుండి దుముక మోకాలికొక బలమైన గాయము తగిలెను. అందుచే నతఁడు భాగీరథీజలములు పైకి తెప్పించుకొని స్నానము చేయుచుండెను. దీపావళినాఁడు (1906 అక్టోబరు 17 వ తేది)

ఒక వ్యాసమును వ్రాసియుంచి, గంగాతీరమునకువచ్చి ప్రతిదినము తానొనర్చు శరీరవ్యాయామముయథావిధిగఁ జేసి గంఠదఘ్నముగ నీటనిలచి దైవస్తుతి గావించి నాసాకర్ణరంధ్రములఁ గరాంగుళుల నదిమి నీటమునిగెను. మునుగుటతోడనే కాలిక్రింది పట్టు తొలఁగెను. గంగమ్మతల్లి యాతనిఁ దన తరంగ హస్తములతోఁ బ్రాణాధిక ప్రణయముతో లాగికొనిపోయి సుడిగుండమునఁ జేర్చెను. ప్రవాహవేగమును దాళఁగల దైహిక బలము రామునకు లేదు. గంగాకూలమునఁ గూలిన యామట్టికొంప యేమైనదోగాని యందధివసించి దానికి గౌరవముగూర్చిన రాముఁడు మాత్రము శాశ్వతానంద సామ్రాజ్య పట్టాభిషిక్తుఁడయ్యెను.



అతఁడు తన తుదివ్యాసమునఁ దుది ఘట్టమున నిది పెన్సిలుతో వ్రాసెను.



"మృత్యూ, వలయునేని యీ శరీరమును గొనుము. నేను లెక్కసేయను. నాకు వలసినన్ని శరీరము లున్నవి; నేనా చంద్రుని కిరణపుంజములలోని రజత సూత్రముల ధరించి జీవింపఁ గలను. నేను దివ్యస్రవంతి రూపమును లేదా కొండవాగు రూపమును ధరింపఁ గలను. నేను సముద్ర తరంగములతో నాట్యము సేయఁగలను. మందమందముగ నందముగ నడయాడు మలయానిలమును నేనే. నేనే ఫెళఫెళార్భటులతో నొడలు తెలియని యున్మత్తునిచందాన వచ్చువాఁడను. ఈ నా రూపములన్నియుఁ బరివర్తనమును ప్రయాణము చేయుచున్నవి. నేనీ పర్వతాగ్రములనుండి వచ్చి మృతుల నుజ్జీవింపఁ జేసితిని. నిద్రితుల మేల్కొలిపితిని. సుందర ముఖముల పైనున్న మేలిముసుగులఁ గొన్నిటి

దొలఁగించితిని. దుఃఖితుల కన్నీరు తుడిచితిని. పికిలిపిట్టను గులాబినిజూచి రెండింటిని బుజ్జగించితిని. నే నన్నింటిని స్పృశించితిని. నా కన్నిఁటితో బాంధవ్యము గలదు. నే నిప్పుడు నా టోపీని దులిపికొని వెళ్ళుచున్నాను. నన్నెవ్వరు కనుగొనఁ జాలరు. ”

సామాన్య మానవకుటుంబమున జనించి, మానవాదర్శ మూర్తుల దర్శించి, విశ్వవిద్యాలయ విద్యాప్రపూర్ణుఁడై యాచార్యుఁడై హిమవచ్ఛృంగముల నధివసించి, మహారణ్యములఁ బర్యటించి, భయమును జయించి, యాత్మతత్త్వమును గాంచి, యఖండ భూవలయమున నమోఘ దివ్యప్రబోధగీతికల నినదించి పవిత్ర భారత భూఖండమున భాగీరథీ గర్భమున విలీనుఁడై విశ్వతోముఖ వ్యాప్తినంది విశ్వరూపుఁడు విశ్వాతీతుఁడునైన రామతీర్థుఁడు సహజ కవితావేశముగల వేదాంతి. ఆదర్శ సన్న్యాసి – ఆదర్శ గృహస్థుఁడు – ఆదర్శ విద్యార్థి – సుకృతీ గతాయుః అను సూక్తికిఁ దార్కాణ. అతఁడు చరితార్థ చరితుఁడు. అతని కీర్తి యజరామరము.

ఓమ్ సర్వేషామ్ స్వస్తిర్భవతు.
ఓమ్ సర్వేషామ్ శాంతిర్భవతు.
ఓమ్ సర్వేషామ్ పూర్ణమ్ భవతు.
ఓమ్ శాంతిశ్శాంతిశ్శాంతిః.



బాపట్ల శ్రీ అత్రివాణి ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె–12-7-1950